


జయజయ గృహలక్ష్మి శ్రీ·సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు : ఎడిటర్ :
డాక్టరు కే. యన్. కేసరి సి. సి. పున్నయ్య

# మన ఆహార వసతులు

ఈ మధ్య తయారైన ఒక నివేదికలో ప్రపంచం మొత్తంమీదలోకైన, లోపభూయిష్టమైన ఆహారమును స్వీకరించేవారు భారతీయులని అయితే విద్యా, సాంస్కృతిక, తాత్వికస్థాయిలో మాత్రం ప్రముఖస్థానము నాక్రమించియున్నారని వివరించబడింది. ఈ విషయం ఇక్కడి ప్రజలను, వారిదైనిక జీవితాన్ని పారజూచిననే ఋజువగుచునేయున్నది.

చాలినంత స్వయం సమృద్ధమైన ఆహారం ప్రజలకు లభించక పోవడంవలననే వారికాహారం లోటుగాను, లోపభూయిష్టంగానుండటం. అయితే ఆహారం ఉత్పత్తికి అవకాశాలు లేవనికాని, అవసరమయితే యితరదేశాలనుండి తెప్పించుకోలేకకాని కాదు. పాడిపంటలు విస్తారంగానుండుట కవకాశంగలదేశం. ఫలములు, కాయగూరలు ఫలించుటకు వసతులున్నవి. మాంసాహారమునకు అలవాటుపడిన వారికి సయితము అవకాశములు విస్తృతంగానేయున్నవి. కాని తమ ఆరోగ్యానికి వలసిన మెరుగైన

ఆహారాన్ని సమకూర్చుకోడానికిగల అవరోధాలను తొలగించుకోడానికి ప్రయత్న లోపము కొంతయని చెప్పకతప్పదు.

కృషికి తగిన ప్రతిఫలం యీ దేశంలోనింతవరకు ప్రజలకు లభించకపోవుట యిప్పటి ఆర్థికదుస్థితికి కారణము. పైగా ఉత్పత్తిదారుల, వ్యాపారుల దృక్పథం అధిక లాభాలనుద్దేశించినదే కాని ప్రజలశ్రేయస్సు నుద్దేశించినది కాదు. దీనికితోడు ప్రజారోగ్యభంగకరమగు కల్తీపద్ధతికి వ్యాపారులు, ఉత్పత్తిదారులు, అలవాటు పడ్డారు. ప్రజలు తమ చాలీచాలని ఆదాయంతో కడుపులు నింపుకోడమే ప్రధానంగా నెంచి కల్తీ ఆహారమునకే పాల్పడక తప్పడంలేదు. అనేక కుటుంబాలు అద్దైనా రెండుపూటలకు లేక ఆకలి బాధలకు నకనకలాడుతున్నవి. తత్ఫలితమే యీనాటి బక్క చిక్కిన శల్యావశిష్టాలు, క్షయలాంటి భయంకరమైన వ్యాధులకు గురియై ఏటేట అనేకమంది మృత్యుదేవత కాహుతి యగుటాను.

మనదేశంలో మనకున్న అవకాశాలను జపానుదేశంలాగ సద్వినియోగంచేసికుంటే ఆహారంలోనే కాక యితరరంగాలలో కయితం స్వయం సమృద్ధిని సాధించవచ్చును. అహార ఉత్పత్తిపట్ల ఆసక్తి పెరుగాలి. అట్టి ఆసక్తికి ప్రభుత్వము విశేషంగా ప్రోత్సాహమివ్వాలి ప్రజలలో సోమరితనంగాని, నిర్లక్ష్యముకాని యిట్టి సమస్యలపట్ల వాంఛనీయములు కావు. పాడిపంటలు, ఫలపరిశ్రమ, కాయగూరల పెంపకం, కోళ్లు గొఱ్ఱెలు, మేకలు యిత్యాదుల పోషణ, మత్స్యపరిశ్రమ ప్రజల ఆసక్తితో, కృషితో సర్వతోముఖాభివృద్ధి చెందితే యీ నాటి ఉత్పత్తిదారుల, వ్యాపారుల కుయుక్తులు, దురాశలు అరికట్టబడుతవి. వీటన్నిటితో ఆహారవిలువలను, నాణ్యమును గుర్తించి తమ అవసరాల కనుగుణంగా సేకరించి వినియోగించుకోడానికి అనువైన ఆదాయమును ప్రజలు తాముకృషిచేసి ఆర్జించుకోడానికి అవకాశాలు ఏర్పడాలి. అప్పుడే ఆరోగ్యసౌభాగ్యాలు మెరుగై తోడి దేశాలతో సమానంగా జీవయాత్రసాగించగలం.



# ఐతరేయోపనిషత్తు

**పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-**

అనువాదము: **Dr. W. రాధాకృష్ణయ్య**

(గతసంచిక తరువాయి)



"నేను చాలకాలమునుండి సాధన చేయుచున్నాను. శంపూర్ణారోగ్యత పొందియున్నాను. నా మనసు బుద్ధియందు స్థిరముగనున్నది. నా వాక్కు మనసునందు స్థిరమైయున్నది." కొన్ని సమయములలో మనము సూక్ష్మ అంశములను బాగుగ గ్రహించగలిగినట్లనుభవించుచున్నాము. కాని త్వరలో వాటిని మరచిపోవుచున్నాము. కనుక "నేను విను విషయములు నన్ను వదలకుండును గాక! వేదాంతమును నేను మరువకుందును గాక! దాని సహాయములేనిది, నేను అభివృద్ధి పొందజాలను. గురువు భావోద్రేకముతో మాట్లాడుచున్నాడు. నేను వానినెల్ల విని, ధారణ చేసుకొనవలెను. వేదములందలి రహస్యములను నేను గ్రహింతును గాక! వినినది ధారణ చేసుకొందును గాక!" విని, ఆనందించి, మరచిపోవుట కాదు. వినుటకు, శ్రవణము చేయుటకు భేదమున్నది. వినుట కేవల శ్రోత్రేంద్రియ స్పర్శవలన కలుగుచున్నది. శ్రవణము చేయుట బుద్ధిపూర్వక గ్రహణము. సామాన్యుల మాటలను మనము వినుచుందుము, కాని మరచిపోదుము. జ్ఞానుల వాక్యములను శ్రవణము చేయుదుము. అనుభవింతుము. మరచుట లేదు.

హిందూమత శ్రుతులందు బ్రహ్మము అనగా, సత్యస్వరూప పరమాత్మ. అతడు సర్వవ్యాపి. చరాచర ప్రపంచమంతయు అతని స్వరూపము. ఈ ప్రపంచమునకంతయు అతడు అచల ఆధారశక్తిగ నున్నాడు. సర్వశక్తులకు, సర్వజ్ఞానమునకు అతడు నిలయము. ఆత్మయనగా, మనయందలి జీవచైతన్య శక్తి. ఆ శక్తి ప్రత్యక్షానుభవముగ పొందదగి యున్నది. అట్టి ప్రత్యక్షానుభవ సమయమున వ్యక్తి అద్వితీయ ఏకబ్రహ్మమునే అనుభవించును. ఘటము నందలి ఆకాశమునకు, వెలుపల మహాకాశమునకు భేదములేదు.

ఇతర గ్రంథములవలెగాక, శ్రద్ధ, శక్తి, నిర్మల జీవితము, అనుభవములుగల, గురువు శ్రుతులను బోధించుటవలన, శిష్యులు, వదనుగుణముగ బోధపొంది, అనుభవించి, ఫలితార్థులగుచున్నారు. అందునిమిత్తము, గురుపాదముల నాశ్రయించిన శిష్యులు, ఇతర వ్యవహారములనెల్ల వదలి, ఇంద్రియములనెల్ల వశపరచుకొని, ఏకాగ్రత పొందుచున్నారు. గురువు తన ఆత్మానుభవ శక్తిని, తన వాక్యములద్వారా శిష్యులందు ప్రవేశింపజేయును. వారిమనసు ఎట్టి ఆవేశములు లేక నిశ్చలముగ, శాంతముతో, హెచ్చరికతో వినుటకు వేచియుండును. అట్టి వాక్యములు శ్రవణకాలమునందే, శక్తిప్రయోగములవలె, వారి హృదయమందు ప్రవేశించును. గురువుకు సరిసమానముగ శిష్యులు ఆత్మానుభవము పొందగలుగుచున్నారు. శాంతిపాఠమున యీ భావము తెలియుచున్నది.

వాక్కునకు, మనసునకు గల అధిష్టాన దేవతల గూర్చి శిష్యుడు ప్రార్థన చేయుచున్నాడు. వేదములు తెలుపు సత్యమును తాను గ్రహించవలెనని అతని కోరిక "నేను వినునది జారిపోకుండును గాక." వేదము పరిపూర్ణ, పరిపక్వ జీవితశాస్త్రము. కనుక ఒకరోజు తెలిపిన విషయము, మరుసటిరోజు తెలుపగల బోధకు అనుగుణముగ నుండును. విచారమునగల వరుసక్రమము ఎడతెగకుండుటకు శిష్యుడు సూక్ష్మగ్రాహిగ నుండుటేగాక, తీక్ష్ణధారణాశక్తి - మేధావంతుడుగ నుండవలెను. ఒక పర్యాయము వినిన విషయము అచ్చొత్తినట్లు, శిల్పరాతిపై చిత్రములు చెక్కినట్లు శాశ్వతముగ నిలిచియుండవలెను. ఇట్టి మేధాశక్తి, జ్ఞానసాధనయందు గొప్ప అంతరంగ సంపదగ నున్నది.

"నా జీవితమును రాత్రింబగలు విచారణయందు వినియోగింతును గాక!" ధారణాశక్తి స్వప్రయత్నము వలన, బుద్ధిపూర్వక కృషివలన కలుగును. ఇట్టిశక్తి అకస్మాత్తుగ చేకూరదు. ఇతరుల కటాక్షమువలన కలుగదు. ఇతరులొసగు సంపదవలన కూడిరాదు. ఒకడు చక్కగ గ్రహించగలుగుచున్నాడు. కాని, ధారణ చేసుకొనలేకున్నాడు. మరియొకడు వినినదెల్ల

మరచుటలేదు. ఒక విషయమును చాలకాలము ఎడతెగక చింతించుచుండుటవలన, ధారణాశక్తి చేకూరుచున్నది. ఇట్టి మానసిక చింతన, బుద్ధిపూర్వక గ్రహణమును, 'మననము' అనబడును. మననము చేయుటకు మనము ప్రపంచమును వదలి గుహలు ప్రవేశింప నవసరములేదు. మనసునందొక మూలలో, ఆలోచనలను నిలుపుకొనుటవలన, మననము చక్కగ జరుపగలదు. ఒకమూలయందు వెల్చబడు ధూపముయొక్క సుగంధము, గదియంతయు నిండి, కిటికీలద్వారా బైటికి కూడ వ్యాపించును. అదేరీతి వేదాంతవిషయములొకతూరి వినినవాటిని మనసునందొక కోణమున, రాత్రింబగలు చల్లారకుండ నుంచుకొనినచో, కొద్దికాలములోగా, వాటి పరిమళము, ఆలోచనల, భావముల, వాక్యముల, కార్యముల, రూపమున బాహ్యప్రపంచమున వ్యాపించును.

ఇట్టి పరిశ్రమ, సాధనయందు, ప్రారంభకాలమునసైన, విరామములేక, శ్రద్ధ, పట్టుదలలతో, రాత్రింబగలు అభ్యసింపవలెను. ఇట్టిభావము తెలుపుటకై "రాత్రింబగలు" అను వచనము శాంతిపాఠమున ఉపయోగించబడియున్నది. మరియు నేను బుద్ధిపూర్వకముగ సంస్కారము పొందియున్నాను. వృధాప్రసంగములు తొలగించుకొనియున్నాను. గురువాక్యములను శ్రద్ధతో విని, తదనుగుణముగ వ్యవహరింపగలుగుచున్నాను. రాత్రింబగలు నేను సత్యవిషయములనే, మననము చేయుచున్నాను. కనుక పరబ్రహ్మము నాకు ప్రత్యక్షమగుటకై వేడుకొనగల హక్కు నాకు కలిగియున్నది. వేదాంతసాధనయందట్టి వృధాప్రసంగములులేక, ఏకాగ్రతతో వినిన విషయములను, శ్రవణ, మననములు చేయుట ముఖ్య పరిశ్రమగ నున్నది.

"నేను సత్యమును చింతించుచున్నాను. సత్యమును పలుకుచున్నాను." పసితనమునుండి, సత్యమును పలుకవలెను. నమ్మక ప్రవర్తనముండవలెను. అసత్యము పలుకుట, మోసము చేయుటవల్లన దుఃఖముల పాలగుచున్నాము. పై వాక్యములలో గల తర్కమును తెలుపకపోయినచో, విశేష శాస్త్ర పరిజ్ఞానము, బుద్ధిప్రకాశముగల నేటి తరమువారికి మాటలందట్టి గురుత్వము కుదురదు. పెద్దల వాక్యములందు గౌరవము, వినయవిధేయత, ప్రతికూలరహిత విశ్వాసము, నేటి సంఘమున వెదకినను దొరకదు. ఒక చిన్నబిడ్డకూడ ప్రతి మత సంబంధ నీతినియమమున గల తర్కమును విమర్శించుచున్నాడు. [illegible] వారికి తర్కములను నచ్చచెప్పగలిగినచో, వారట్టి సంకోచములులేక వీటియందు విధేయత చూపగలరు.

"నేను సత్యము (ఋతం) నే చింతించుచున్నాను." అనగా పరబ్రహ్మమును—సత్య పరిపూర్ణుని తెలుపు శ్రుతులను విచారించుచుండుటయందు నా బుద్ధి పూర్ణముగ లగ్నమైయున్నది. ఓర్పుతో, గ్రంధానుసారము నా బుద్ధి సంస్కారము పొందుచున్నది. స్థిరముగు విజ్ఞానకళను అనుభవించగలుగుచున్నాను. అట్టి పరిశ్రమ నాకు, నా పరిసరములవారికి కూడ ఆధారముగ, ఆనందదాయకముగ నున్నది."

ఈ రీతి జీవితసత్యములను చక్కగ విమర్శించి, జీర్ణించుకొనుచు నా యొక్క బుద్ధిని, అభివృద్ధిపొందునట్లు చేసి, జీవితగమ్యముల, గమ్యసిద్ధాంతముల, స్థిరముగ తెలుసుకొనుచున్నాను. అట్టి నిలకడపొందిన వెనుక, నా మనసును కూడా నాయొక్క బుద్ధిపూర్వక సమాధానములతో ఏకీభవించునట్లు సంస్కరించుచున్నాను. కనుక, "నేను సత్యమును పలుకుచున్నాను." అనగా, నా ఆలోచనలను, మాటల మూలమున చక్కగా ప్రకటించగలుగుచున్నాను.

ఇట్లు ఈ వాక్యములు వ్యక్తియొక్క అంతరంగిక జీవిత తేజమును తెలుపుచున్నది. పరివర్తనము పొందిన బుద్ధి, మనసుయొక్క పరుగులను—మేడమీది గవాక్షములనుండివలె – గమనించుచు, వాటిని నియమించగలిగియుండును. బుద్ధియందు విశ్వాసముండునట్లు మనసు సంస్కరింపబడును: మనసు, బుద్ధి, ఏకీభవించిన, ఆలోచనలెల్ల, వాక్కువలన వెలువడగలదు. బుద్ధి విరామములేక, అట్టివాక్కులపై హెచ్చరికగలిగి యుండును.

ఈరీతి, వాక్కు, మనసు, బుద్ధి, యను మూడు తంత్రులతో అమర్చబడినచో, దానినుండి వెలువడు సంగీతము, శరీరమందిరమునందలి దైవమును కీర్తించు గానముగనుండును. సాధకుడు తన జీవితగానమును నిరంతర కీర్తనరూపమున ప్రభువునకు అంకితముచేయుచుండుటవలన, ఆ ప్రభువు తన్ను, తనగురువును రక్షించవలెనని కోరుటకు అధికారము పొందుచున్నాడు. ప్రాముఖ్యతను నొక్కిచెప్పుటకై "నన్ను రక్షింపుము. నా గురువును రక్షింపుము." అను పునరుక్తి కలదు. కడపట "గురువును రక్షించుము." అని మరల తెలిపియుండుటవలన, ఈ భాగము ముగిసెనని తెలియుచున్నది.

తేజోవంతమగు ఇట్టి ప్రార్థనానంతరము, గురు శిష్యులేకముగ, శాంతి, శాంతి, శాంతి, యని పాడుదురు. మూడు పర్యాయము లిట్లుపలుకుటవలన, పదములు చాలపరచుట కాజాలదు. ఇందొక విశేషమున్నది. గురువు తన అనుభవాంశముల నుత్తేజముగ పలుకుచున్నాడు. అట్టివాక్యములను మనము వినుటలో అనేక విఘ్నములు కలుగగలవు. ఈ విఘ్నములన్నియు ఋషులు, విచక్షణతో మూడు వర్గములుగ విభజించియున్నారు. విఘ్నములు కలుగచేయు అంశముల బట్టి వాటిని వర్గీకరించియున్నారు. 1. అధిదైవికము: దైవకృతములు, ఉరుములు మెరుములు పిడుగులు తుపానులు. 2. అధి భౌతికములు. అగ్ని ప్రమాదములు, వరదలు క్రూర మృగములు. దుర్మార్గులు. 3. ఆధ్యాత్మికములు. కేవల అంతరంగికములు. సోమరితనము. అశ్రద్ధ. విశ్వాసరహితము, మొదలగు దుర్గుణములు, అంతరంగమునుండి యుత్పత్తిపొంది, గురుశిష్యుల అన్యోన్యతను చెరచుచున్నవి. కనుక ఇట్టి విఘ్నములు కలుగని, త్రివిధశాంతియుక్తమగు శ్రవణమును వారుకోరుచున్నారు. ఇట్టి శాంతి పాఠము ప్రతిదినము పాఠ మారంభమగునపుడు ముగియునపుడు గురు శిష్యులు పాడుదురు.

2. భాగము. ప్రథమాధ్యాయము - ప్రథమఖండము.

శు ఓం. ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర
ఆసీత్. నాన్యత్ కించన మిషత్.

[ఆది యందు, ఒక్క ఆత్మయే ఈ ప్రపంచముగ నుండెను. చైతన్యముగలది వేరేదియు నుండలేదు]

ఈ విచారమున, దృశ్యప్రపంచముయొక్క నిర్మాణము, దాని చంచలస్వభావము సదా పరిణామములు పొందుచుండు ప్రపంచమునకు మూలధారమును కనుగొను ప్రయత్నము కనబడుచున్నది. ఒక పరివర్తనము కలుగుటకు, పరివర్తనములేని ఆధారమొకటి యుండవలెను. సల్లుబారక, చలించక, ఘనముగనుండు పుక్కా శైలపట్టీలుండుట వలన, వాటిపై శైలబండ్లు పరుగిడగలుగుచున్నవి. ఒక నదియందడుగు భాగమున, ఘనీభవించిన భూమియుండుటవలన నీరు ప్రవహించి పోవుచున్నవి. నిరంతర పరివర్తనములు కలుగుటకు, కదలని, చెదరని, ఆధారమొకటుండవలెను. మైల పోక, చలించక, చెదరకయుండు తెల్లని తెరపైన, అనేకరూపములతో అనేకవర్ణములతో, సీదశ్వరడి సినిమాయందు నిలుకడలేని కథాప్రదర్శనము కనబడుచున్నది.

ప్రపంచమునందు నిరంతరము మార్పులు కలుగుచున్నవి. అంతులేక పరివర్తనములు చెందుచుండుటచే ప్రపంచమునకు శాశ్వతగుణముగనున్నది. ప్రపంచమునకు పరివర్తనములు శాశ్వతమై యుండుటవలన, ప్రపంచముకూడ శాశ్వతమను భ్రమకలుగుచున్నది. నిరంతర పరివర్తనములీరీతికలుగుచుండుటకు, మార్పుచెందని, అచల, శాశ్వత అంశమొకటి ఆధారముగనుండవలెను. శ్రుతి గ్రంథములన్నియు అట్టి పరిపూర్ణాంశము యొక్క స్వభావమును, ఉనికిని, ముఖ్యముగ విమర్శించుచున్నవి. అట్టి మూలాధారమును పరమాత్మయందురు.

పరమాత్మ విచారము ఉపనిషత్తులందు కలవు. ప్రత్యక్ష జీవితమునకు అధారమగు దైవాంశమును అందు విచారించబడుచున్నది. శిష్యుడు గురువునాశ్రయించునపుడు అతని మనసునకొన్ని సంశయములుండెను. జీవితమనగానేమి? జీవితగమ్యస్థానమేమి? జీవరాసులను, విషయసముదాయములను, వ్యవహారములను, పరిస్థితులను, జీవితవిధానములను అందుగల అనుకూల ప్రతికూలములను, తన జ్ఞానేంద్రియముల సహాయమున తెలుసుకొన కోరుచున్నాడు.

“ఇవన్నియు యెచ్చటినుండి కలిగినవి? ఎందుకు, కలిగినవి? సృష్టిక్రమ మెప్పుడారంభమాయెను? ఎట్లు ఎందుకు, ఎప్పుడు? సృష్టికి పూర్వమేముండెను?” శిష్యుడుతనకు గల సంశయములనెల్ల, గ్రుక్క తిప్పుకొనక, గురువులకు నివేదించెను. తనబుద్ధి భ్రమలనెల్ల, మనోవైకల్యముల, భావావేశముల, ప్రేమపూర్వక ఆందోళనములనెల్ల, గద్గదస్వరముతో ప్రశ్నించెను. ఈ ప్రశ్నలకెల్ల గురువు వెంటనే సమాధానములు తెలుపలేదు. సూటియగు జవాబివ్వలేదు.

కొంతకాలము జరుగగా, అనగా శిష్యుడు కొంత క్రమశిక్షణపొందిన వెనుక, గురు శిష్యులకు అన్యోన్యత కలిగిన వెనుక, హృదయమైత్రి చేకూరిన వెనుక, జ్ఞానబోధ ప్రారంభమగుచున్నది. గురువు తెలుపు సమాధానములు శ్రుతులనబడును.

(సశేషము)

# ఎర్ర గులాబీ

మూలం :
ఆస్కార్ వైల్డ్

అనుసరణ :
యస్. ఆర్. ద్విభాష్యం

"ఒకేఒక పువ్వు — ఎర్రటిది - గులాబీపువ్వు. ఆమె నాతో కలసి రాక్ అండ్ రోల్ (నృత్యము) చేయడానికి ఒక్కటి చాలు. ఇంత పెద్దవనంలో కన్ను పొడుచుకున్నా ఒక్కటైనా దొరకలేదు. ఎంత చిత్రం! ఆమె ప్రేమవిలువ ఒక్క ఎర్రని గులాబీ పువ్వు. దానికి నేను నోచుకోలేదు. ఎంత దురదృష్టవంతుణ్ణి!" అనుకుంటున్నాడొక విద్యార్థి కిటికీదగ్గర కూర్చొని.

అల్లిబిల్లిగా అల్లుకొనియున్న చిగురాకుల పొదల మధ్య తియ్యని కంఠస్వరముతో గొంతెత్తి ఆలాపిస్తున్న కోకిలమ్మ చెవిలో పడ్డాయీ మాటలు. వయ్యారంగా ఆ విద్యార్థి ముఖంవైపు వంగి చూచింది. నిస్పృహా, నిరాశ, ఆదుర్దాలు ప్రతిఫలిస్తున్న అతని వదనముచూచి ఆశ్చర్యపోతూ నోరుతెరచి అలాగే యుండిపోయింది పాపమాకోకిల.

అమూల్యమైన ప్రేమ యింత అల్పమైన వస్తువు మీద నాధారపడియున్నదని విద్యార్థి భ్రమించాడు. అయినా దురదృష్టం కాకపోతే యింత పెద్ద పుష్పవనంలో ఒక్క పువ్వైనా దొరక్కుండా పోతుందా! కన్నీరు కార్చాడు. "ఎన్నో గ్రంథాలను చదివాను; ఎన్నో తత్వాలు విన్నాను; ఎంతో విజ్ఞానాన్ని సంపాదించాను; కాని ఏం లాభం? యింత అల్పమైన వస్తువు - ఒక్క ఎర్రగులాబీ పువ్వు నా జీవితాన్ని నిస్సారంగా చేసేస్తోంది. అబ్బ! ఆ గులాబీ పువ్వు అంత విలువకలదా!" యని విద్యార్థి పలవరిస్తుంటే వింటున్న కోకిల అతని చిన్నారి పొంగి పొరలే ప్రేమనుచూచి వగచింది.

నిజానికి ఆ విద్యార్థికి ఆమెతో అంతగా పరిచయంలేదు. అయినా ఆమె గుణగణాలను గానం చేస్తూ కీర్తించేవాడు. ఆమె లావణ్య సౌందర్యాల నూహించి తబ్బిబ్బయ్యేవాడు. ఇలా కొంతకాలం గడుస్తుంటే ఆ విద్యార్థి వాలకం చూచి, పాటలు వింటుండేది కోకిల. ఆ వనంలో మాత్రం ఒక్క గులాబీపువ్వైనా వికసించలేదు. అతని ఆశ నిరాశ అయింది. ప్రియురాలి ముద్దుమోము తన వక్షస్థలము మీద విశ్రమించాలంటే ఒక్క ఎర్ర గులాబీపువ్వు యుంటే చాలననుకున్నాడు. ఆమె కోమలహస్తాలు తన హస్తాలలో నలిగిపోవాలంటే, ఆమె చూపులు తన చూపులతో కలసిపోవాలంటే, ఆమెను బాహువులలో బంధించి, తనివితీర హృదయానికి హత్తుకొని ఆమె నవనవలాడే పెదవులను, చెక్కిళ్లను ముద్దిడడానికి ఒకేఒక ఎర్రగులాబీ చాలుననుకున్నాడు అమాయకుడు — విద్యార్థి. కాని తన దురదృష్టాన్ని తలచుకొని భోరున ఏడువసాగాడు. తన్ను తాను నిందించుకోసాగాడు.

ఆ విద్యార్థి సంకటస్థితిని చూచి ఆమె 'శభాష్! ప్రేమికుడా!' అనుకొని ప్రేమ ఒక విచిత్రమైన వస్తువేమో ననిపించింది ఆమెకు. దానినిగురించి లోకానికి గొంతెత్తి పాడి వినిపించాలనుకున్నది. లయతోకూడిన స్వరంతో "ఆమెకాళ్లు నాట్యానుక్రమిస్తవి. చుట్టూయున్న వాళ్లు ఆమెను వేనోళ్ల పొగడుతారు. ఆమెను బంతిలాగ ఎగరేసి పట్టుకుంటారు. అదిచూచి తనకేమి లాభమనుకున్నాడు. ఆమెతో నాట్యం చెయ్యడానికి తనకు యోగ్యత లేకపోయింది కదాయని శూన్యాకాశంవైపు చూడసాగాడు. పొంగిపొరలివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక రెండుచేతులతోను ముఖం మూసుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు.

కడుపు నింపుకొని శ్రమతో చెట్టు ఎక్కుతున్న తొండ యిదిచూచి "అరెరె! ఏడుస్తున్నావా! ఏమిటి సంగతి?" అన్నది విద్యార్థి వంక చూచి.

చిత్రవిచిత్రమైన రంగులతో వయ్యారంగా నిలబడిన రెక్కలను ఆడిస్తూ పువ్వులమీద వాలి మకరందాన్ని గ్రోలుతూన్న సీతాకోకచిలుక 'ఏమయింద'ని అడిగింది.

"అబ్బే! ఏమీలేదు. ఒక్కగానొక్క ఎర్ర గులాబీ పువ్వు దొరక్క ఏడుస్తున్నాడు" అన్నది కోకిల.

ఇదివిని తొండ "అయ్యో! రామా! ఎంత హాస్యాస్పదం! ఒక్క పువ్వు కొరకని ఆడదానిలాగ యింత ఏడుపా! ఛీ! ఛీ!" అని నవ్వ నారంభించింది.

"ఎవరెలా ఏడిస్తే నాకెందుకు?" అని వన్నెల విసిరి సీతాకోకచిలుక తన పనిలో నిమగ్నురాలై పోయింది.

విద్యార్థి హృదయావేదన అర్థమయింది కోకిలమ్మకు మాత్రమే? అతిగంభీరంగా తీవిలోనే కూర్చొని ప్రేమయొక్క మహాత్మ్యాన్ని, అద్భుత శక్తిని యూహిస్తున్నది.

ఒళ్లు విరుచుకొని రెక్కలాడించి ఎగిరిపోయి ఒక చిన్న గులాబీమొక్క దగ్గరకు వెళ్లి "ఒక్క ఎర్ర గులాబీ పువ్వును యిస్తే ఆజన్మాంతము నిన్ను గురించే మధురగీతాలు పాడతాను" అని అడిగింది కోకిల.

"నావన్నీ తెల్లగులాబీలే నమ్మా!" యంటూ నిస్సారంగా జవాబిచ్చి "అయినా అగు! అదుగో అటుచూడు — ఎత్తుగానుండే - ఆ సూర్యముఖి దగ్గరకు వెళ్లు - బహుశా అది నీకోర్కె తీర్చగలదు" అంది ఆ గులాబీ మొక్క.

తిన్నగా అటువెళ్లింది కోకిల. వినయంగా తనకొక ఎర్ర గులాబీపువ్వును యివ్వమని ప్రాధేయపడింది.

సూర్యముఖి "నావన్నీ పచ్చని పూవులే - నీకు గాను ఎర్ర గులాబీల నెల సృష్టించగలను?" అని విసుగ్గాయని "అక్కడే - విద్యార్థి కూర్చున్న కిటికీకి దగ్గరగా కొమ్మలతో, రెమ్మలతో, చిగురాకులతో గుబురుగానున్న గులాబీ మొక్క నడుగు — అది బహుశా నీకోర్కె తీర్చవచ్చు"నంది సూర్యముఖి.

కోకిల రివ్వున అటువైపుకు ఎగిరిపోయింది. వినయంగా ఆ మొక్కముందు నిలబడి "నాకొక ఎర్ర గులాబీ కావాలి. కనికరించి యిస్తే నేను సర్వకాల సర్వావస్థలలోను నీముందు ఆడుతూ పాడుతూ సేవ చేస్తాను" అంది కోకిల.

"బాగానేయుంది! నిజానికి నావన్నీ ఎర్రగులాబీ పుష్పాలే. నా కొమ్మలు, రెమ్మలు, చిగురాకులు చూచి భ్రమపడి యిటకు వచ్చియుంటావు. ఈ పాడు చలిమూలంగా నా నరాలన్నీ నిస్సత్తువయిపోయాయి. ఈ చలికి మొగ్గలన్నీ ముడుచుకపోయి రాలిపోయాయి. ఈమధ్యన వచ్చిన తుపానుకు చాల పాడైపోయి యిప్పుడిప్పుడే కోలుకుంటున్నాను అయినా నా సొదవలన నీకేం లాభం? ఒక్క సంవత్సరంవరకూ ఒక్క పువ్వునైనా నీకివ్వలేను" అని జవాబిచ్చింది కిటికీదగ్గర రోజామొక్క.

కోకిల "అలాగంటే ఎలాగు! ఒక్క ఎర్ర గులాబీ కోసరం ఏదైనా ఒక ఉపాయం ఆలోచించి యియ్యకలుగాలి" అని ప్రాధేయపడుతూ ప్రార్థించింది.

రోజాచెట్టు కొంచము సేపు తటపటాయించి "ఒకటే ఉపాయముంది. అయితే గొప్ప త్యాగం చెయ్యాలి. అందుకనే చెప్పడమా, మానడమా యని ఆలోచన" అన్నది.

"అలస్యమెందుకు! ఎట్టి త్యాగమయినా చేయ సిద్ధం" అన్నది కోకిల.

"నీకు పువ్వు కావలిస్తే..."

"ఆ...ఆ...కావలిస్తే .."

"చెప్పేదా...ప్రాణత్యాగం చెయ్యాలి! నీ హృదయంలోని రక్తంతో పువ్వును సృష్టించాలి. నీ గానసుధతో రక్తాన్ని వేడెక్కించి ఉద్రేకపరచాలి. నీ హృదయానికి నా ముల్లును అదిమిపట్టి పాడాలి. ఆ వెచ్చని రక్తాన్ని నా నరాల్లోకి ఎక్కించాలి. అప్పుడే నీ కోర్కె నెరవేరుతుంది...ఒక్క పువ్వు కొరకూ యీ ప్రాణత్యాగం! — మరి నీకు ప్రాణం మీద మమకారం లేదూ? హాయిగా వసంత ఋతువులో లేచిగుళ్లమధ్య కూర్చొని గానంచెయ్యి! వెన్నెల రాత్రుళ్లలో మైమరచి ప్రేమికులను మైమరపించు! ఒక్కగానొక్క పువ్వుకోసరం యింత దొడ్డ త్యాగం చేయడం చాదస్తం సుమా! ఎవరెలా పోతే నీకేం! నీ త్యాగానికి తగినఫలితం నీకుపయోగపడేది కాదు. బాగా ఆలోచించు — ప్రేమకు సాటియైనది మరొకటి లేదనేది సత్యమే. మానవహృదయానికి పక్షి హృదయాన్ని పోల్చిచూస్తే మొక్కయొక్క ఆకులాంటిది. ఎందుకయినా మంచిది... బాగా ఆలోచించుకో..." అన్నది రోజామొక్క.

కోకిల తిరిగి చూచింది. విద్యార్థి యింకా కండ్లవెంట నీటిధారలతో నిద్రపోతున్నాడు. సుఖంగా నుండమని అతనిని ఆశీర్వదించింది. అతనికోర్కె నెరవేర్చడానికి రాత్రంతా పాడి పువ్వును నిర్మిస్తానని వాగ్దానం చేసింది. తన వెచ్చని రక్తంతో ఎర్ర

గులాబీని నిర్మించి తీరుతానంది. ఆదర్శ ప్రేమికుడుగా నుండమంది. ప్రేమ అమూల్యమైనదని, ప్రేమాధరంలో అమృతము కలదని, దాని ప్రత్యేక ఉచ్ఛ్వాసంలో తీయని వాసన మిళితమై యున్నదని ఏకరువు పెట్టింది.

విద్యార్థి కళ్లు తెరిచి చూచాడు. కోకిల చెప్పిన దేమీ అతనికి అవగాహనమయినట్లు లేదు. మొక్క మాత్రం తన కర్థమయినట్లు తన కొమ్మల్ని, రెమ్మల్ని, ఆకులను అల్లలాడించింది.

దీనంగా విద్యార్థి "నన్నే కాకిగా చేసి వెళ్లబోకు! ఒక్క పాట మధురాతిమధురంగా పాడవూ!" అన్నాడు కోకిల నుద్దేశించి.

కోకిల కంఠమెత్తి శ్రావ్యంగా ఆలాపన చేసింది. విద్యార్థి తలపైకెత్తి ఆలోచించాడు. రూపమున్నా జీవితమును నష్టపరచుకోలేదనుకున్నాడు. మనస్సు యున్నా యితరులకొరకు త్యాగం చేయడం సులభసాధ్యమైన పని కాదనుకున్నాడు. ఇతరులవలె కోకిలకు స్వార్థమున్నదనుకున్నాడు. తన మధురాతిమధురమైన గానంతో అందరినీ ఆనందడోలికలలో నూగిస్తుంది, కాని త్యాగం మాత్రం చేయలేదనుకొని విద్యార్థి గిరుక్కున వెనక్కు తిరిగి మంచంమీద వ్రాలాడు.

చంద్రోదయమయింది. కోకిల మొక్కమీద వ్రాలి దాని ముళ్లను తన హృదయానికి అన్చి తన తియ్యని కంఠంతో పాడనారంభించింది. చంద్రుడు తన గమనాన్ని తగ్గించి ఆ మధురస్వరాన్ని వినసాగాడు. ముళ్లు హృదయంలోకి చొచ్చుకొనిపోయినకొలది కోకిల స్వరం స్ఫుటం కాజొచ్చింది.

మొట్టమొదట బాలబాలికల భావాలను గానం చేసింది. కొమ్మ శిఖరాన మొగ్గ పుట్టింది. ఒక్కొక్క పాటకు ఒక్కొక్క దళం పుట్టుకొచ్చింది. నదిమీద అలముకున్న మంచువలె పువ్వు కనిపించింది.

"హృదయాన్ని బాగా అదిమిపట్టాలి కోకిలా! లేకపోతే రంగు రాకుండానే తెల్లవారిపోతుంది" అని మొక్క హెచ్చరించింది.

కోకిల ముల్లుకి తన హృదయాన్ని బాగా అదిమిపట్టింది. ఈసారి యువతీయువకుల భావాలనుగురించి పాడింది. మునుపటికంటె స్వరం బాగా పెద్దదయింది. యౌవ్వనయువతిని ముద్దిడగానే చెక్కిళ్లు ఎర్రబారినట్లు గులాబీపూవు రేకులకు ఎర్రరంగు అలుముకో సాగింది.

"కోకిలా! ముల్లు హృదయానికి యింకా హత్తుకోవాలి. పువ్వు యింకా వెలవెలబోతూనే యున్నది. సూర్యోదయానికి ముందే పువ్వుకు ఎర్రరంగు రావాలి. అలా కాకపోతే అంతా వ్యర్థం" అని అరచింది మొక్క.

కోకిల తన హృదయాన్ని ముల్లుకు బాగా అదిమిపట్టింది. నరాల్లో బాధ ప్రారంభమయింది. బాధతో బాటు స్వరం సయితం ఉచ్ఛస్థాయి నందుకున్నది. ఈసారి అమరప్రేమను ఆలాపన చేసింది.

చల్లనిగాలులమధ్య ఉదయసూర్యుని ఎర్రని కిరణాల కాంతిలాగ గులాబీ పుష్పం ఎర్రబారింది. కోకిల కంఠస్వరం క్షీణిస్తోంది. రెక్కలు రెపరెప కొట్టుకోసాగాయి. దృష్టి మందగించింది. తన శక్తి నంతటినీ కేంద్రీకరించి ఆఖరిపాటను పాడింది. ఉషఃకాలాన్ని లక్ష్యం చేయకుండా ఆగి చంద్రుడు తన్మయత్వంతో ఆ పాటను విన్నాడు.

ఎర్రటి రేకులతో తళతళలాడుతూ పువ్వు వికసించింది.

"పువ్వు ఎంత అందంగా నున్నదో చూడు కోకిలా!" అన్నది రోజా మొక్క.

విగతజీవియై ముల్లునంటియున్న హృదయంతో కోకిల పడియున్నది.

సూర్యోదయమయింది. నిద్రనుండి కళ్లు నలుపుకుంటూ వచ్చి విద్యార్థి కిటికీదగ్గర నిలబడ్డాడు. ఎదురుగా గులాబీ - ఎర్రగులాబీ అతని కంటబడింది. దాన్ని చూచి తన అదృష్టానికి అబ్బురపడ్డాడు. దాని సొగసు, సోయగాలను చూచి మురిసిపోయాడు. తన జన్మకిదే శివరాత్రనుకున్నాడు. ప్రేయసితో రాక్ అండ్ రోల్ (నృత్యం) చేస్తున్నట్లుగానే భావించాడు. ఆమె తల్లో తానా గులాబీని తురుముతున్నట్లే భావించి ఆ పువ్వును తుంచేశాడు.

"ఛీ! ఎంత బుద్ధిహీనుడు! ఎందుకీ తొందర" యనుకుంది రోజా మొక్క.

(288వ పేజీ చూడుడు)




# చీకటి వెలుగులు

శ్రీమతి పరాసేని శ్రీశైలభ్రమరాంబ

కళ్లు పొడుచుకున్నా కానరాని అమావాస్యకటిక చీకటిలో గాఢాంధకార బంధురమైన ఆ కాళరాత్రి సమయంలో నిర్మానుష్యంగా వుందావీధి. అక్కడక్కడ కుక్కల మొరుగులు, కీచురాళ్ల రొద తప్పించి అంతా నిశ్శబ్దమయం. రక్తాన్ని చెమటగా మార్చి శ్రమించి, రాళ్లను పువ్వుల్లా మోసి అబ్బాయి బువ్వకోసం బాధపడ్తూ, ఆత్మహత్య చేసుకోడానికి మనస్కొప్పక కన్నీళ్లతోనే మండిన గుండెలార్చుకొంటూ, బాబును నిద్రపుచ్చే సమయమది. జీవితంలో కష్టాలను బ్రతుకులో భారాన్ని మరచి, ఆదమరచి పోవడానికే అబ్బాయిని ఉయ్యాల్లో ఊపుతోంది అభాగిని — తాను తినకపోయినా బిడ్డకు కడుపారా బువ్వపెట్టి, ఎండిన రొమ్ములోని రక్తాన్నికూడా పీల్చి నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నాడా బాలుడు—

ఆ పూరింటికి కొంచెందూరంలోనే ఎత్తైయిన మేడలో మెత్తని పాన్పుమీద పరుండి రేడియో సంగీతం వింటూన్నాడు ముకుందరావు. ఆ ఆనంద గీతానికి తోడుగా ఓ అభాగిని జోలపాటపాడ్తోంది. కాని నిజానికి అది జోలపాటుకాదు; బిడ్డని లాలించి ఉయ్యాల ఊపే లాలిపాటకాదు; హృదయాన్ని కదిలించేబాధ-రాళ్లను సహితంకరిగించేగాధ-ఒక అభాగిని ఆక్రందన. ఎవ్వరూవిని సహించలేనివేదన — ఎంతటి బాధనైనా ఓర్చుకునే సహనశక్తి భారతస్త్రీకి ఉగ్గుపాలతో పెట్టినవిద్య — ఆ ఉయ్యాలా ఊపుతున్న అభాగినే శ్యామల. ఆమె ఏకైక పుత్రుడే బాబు. ఆమె భర్త ముకుందరావు. అతడే స్త్రీలతో పరమానందంగా పూల పాన్పుపై ఆనందిస్తున్నాడు.

అందరిలాగే శ్యామలకూడా తీయతీయని కలలు కంటూ ఆదర్శగృహిణిగా జీవించాలని ఆశించింది. తనభర్త ఉన్నతోద్యోగి అవ్వాలనీ, తను తనభర్త జట్టాపట్టా వేసుకు షైర్లకి, సినీమాలకి, పార్కులకి వెళ్లాలనీ క్షణమైనా విడలేని అన్యోన్యానురాగంతో తమ దాంపత్యం వర్ధిల్లాలని, ఎన్నో — కలలుకంది ఆమె — కాని తనకలలన్నీ కలలుగానే కరిగిపోయాయి — తన పెళ్ళికిచేసిన వేడుకల్లో, వినోదాల్లో భోగంమేళం మొట్టమొదటగా ముకుందరావుని ఆకర్షించింది — ఆ ఆకర్షణ ఫలితమే అతడు వేశ్యాలోలుడయ్యాడు — అంతటితో ఆగక త్రాగుడుకు లోనయ్యాడు.

పగలు కొన్ని గంటలకాలం షాపులో పనిచేస్తూండడం చీకటిపడేసరికి సాని ఇంటికి వెడ్తూండడం, ఇదే తన దినచర్య. తన భర్త త్రాగుబోతు, తిరుగుబోతు అని తెల్సుకోడానికి ఎంతో కాలం పట్టలేదు శ్యామలకి— వివాహమైన ఆరుమాసాల్లో ముకుందరావు పరిస్థితినంతా అర్థంచేసుకుందామె. కాని తమదాంపత్య అనుబంధానికి ప్రతిఫలంగా తనకడుపులో ఒక పాప పెరుగుతోందని గుర్తించుకొన్న ఆమె తన దుఃఖాలు ఒకదరికి జేరగలవని ఆనందించింది. తను గర్భిణీతో వున్నానని తెల్సుకొన్నాక అయినా తన భర్తలో పరివర్తన కల్గుతుందని ఆశించింది. కాని శ్యామల కోరిక ఫలించనేలేదు.

శ్యామల గర్భఫలం ఫలించి మగపిల్లవాడు పుట్టాడు — కొడుకుపుట్టిన తర్వాతకూడా ముకుందరావులో ఏమి మార్పురాలేదు — చేతుల్లో పైకంలేని రోజుల్లో తప్ప త్రాగి రాత్రికి ఇంటికివచ్చి కొట్టేసిన పాములాపడి వుండేవాడు. అతను వచ్చేసరికి ఎంత రాత్రయినా ఆమే మేలుకునేవుండి అతనికి కడుపారా భోజనం పెట్టేది, అతడు తిట్టేతిట్లను బూతుల్ని భూమాతలాసహిస్తూ, తననికొనల్లే ఓర్పుతోవినేది. అతను పెట్టేబాధలన్ని సహించి, అతనికి ఉపచారాలు చేసి అలసిపోయి ఎప్పుడో అతని పాదాలదగ్గరే నిద్రించేది. ఈ విధంగానే ఆమె ప్రసవించేవరకూ అతనికి శుశ్రూష చేసేది —

శ్యామల ప్రసవించేముందు ఓ నాటి అర్ధరాత్రి

సమయాన ముకుందరావు ఇంట్లో సామానంతా తీసుకుని, ఆమెను ఒంటరిగావదిలేసి వేశ్యతోసహా మకాం ఎత్తేశాడు.

కని పెంచిన కన్నవారు, ఆదుకోవలసిన అత్తవారూలేని నిరాధారజీవి శ్యామల. ఇరుగుపొరుగువారి సహాయంతో ఒక పూరింట్లో నివాసంవుంది - ఒక శుభముహూర్తాన పుత్రోదయమైంది. ఎంత ఆదరాభిమానములతో చూచేవారైనా పొరుగువారు మాత్రం ఎంతకాలం తల్లీబిడ్డల్ని పోషించగలరు? బ్రతుకుతెరువు కోసం కూలిపనికి పోతుండేది. పగలంతా కష్టించి పనిచేసి సాయంత్రానికి ఇల్లుచేరి తన బాబును చూసి మురిసిపోయేది. పోలికలో ముమ్మూర్తులా తండ్రినే పోలిన తన బాబును చూచి తండ్రివంటి నీచపుబ్రతుకు మాత్రం తన బిడ్డకురాకుండా చెయ్యమని భగవంతుని ప్రార్థించేది ఆమె -

రోజూ రాత్రిళ్లు తన బాబుని ప్రక్కలో పడుకోబెట్టుకు ఆనందంతో పొంగిపోయేది. అంతంలేని ఆవేదన, భరించరాని బాధలు, కడుపారా తిండికికూడా కరువైన తన బ్రతుకులోని కరువు, తన కింక దూరమౌతుందని అమాయికమైన కళ్లతో, ఆనందజ్యోతిలా వెలిగే బాబు ముఖంచూచాక తన భర్తలో తప్పక పరివర్తన కల్గి తననీ తన బిడ్డనీ ఆదరిస్తాడని తన ఆశలు ఆశయాలు నెరవేరి కోరికలన్నీ కొనసాగే మంచిరోజులొస్తాయని ఎంతో మురిసిపోయేది ఆమె. పెండ్లి అయిన క్రొత్తలో గడిపిన కొద్దిరోజులు ఆమెస్మృతిపథంలో ఎప్పుడూ మెరుస్తూ కన్పించేవి ఆమెకి - మళ్లీ ఆరోజులు వస్తాయాని రాత్రింబగళ్లు ఎదురుచూస్తూండేది -

బాబు పుట్టిన ఆరునెలలకి ఒకరోజు హఠాత్తుగా ముకుందరావు సర్వంపోగొట్టుకొని ఇంటికివచ్చాడు. నిర్ధనుడైనందుకు తన దుస్థితికి విచారించవల్సినదానికి బదులుగా భార్యను హింసపెట్టేవాడు ముకుందరావు. ఒకప్పుడు శ్రీమంతుడై వ్యాపారధర్మాల్ని బాగా తెలిసినవాడు కాబట్టి లారీమీద కొబ్బరికాయల ఎగుమతి చెయ్యడంలోనూ కొబ్బరికురిడీ: కటకటా, గండేరా, కటిక్కాయ. నీటికాయ. కొబ్బరిలోని అన్నిరకాల నాణ్యతలు చూస్తుండడానికై ఓకొట్లో ప్రవేశించాడు. ఆ డబ్బు అసరాచూచుకొని మళ్లీ మేడమీద వేశ్యతో బంధుత్వం కల్పుకున్నాడు ముకుందరావు -

ముకుందరావు కొడుకుని కళ్లారాచూచి, చేతులారా ఏనాడూ ఎత్తుకోలేదు. ఇదివరకైతే నోరు పారేసుకునేవాడేకాని ఇప్పుడు మాత్రం చెయ్యిచేసుకోవడం ప్రారంభించాడు-స్త్రీ జాతికి "సహనమే" పెట్టని ఆభరణం. అందులోనూ పసితనంలోనే తల్లిదండ్రులు కరువైన శ్యామల కష్టాల్లోనే పెరిగింది. ఎన్ని కష్టాలువచ్చినా, భరించినా వుత్తమలక్ష్యాలు వున్న తాశయాలు వున్నశ్యామల ఎదురు తిరిగి భర్తకు ఏనాడూ జవాబివ్వలేదు - తనలోతనే కుమిలికుమిలి ఏడ్చేది - తనభర్తకి త్రాగుడు అలవాటుచేసిన వేశ్యల దానేరం? తన భర్తదా? తనభర్తస్థితికి, అతనిమనో దౌర్బల్యానికి-అతని దుష్టసాంగత్యానికి జాలిపడేది. తన భర్త సత్ప్రవర్తన గలవాడయ్యేటట్లు చెయ్యమని దైవాన్ని ప్రార్థించేది — అన్యాయం. అవినీతి, స్వార్థం పెరిగిపోయిన ఈ సంఘంలో క్రొత్తగా అడుగుపెట్టబోయే తన ఏడాది కొడుకునీ చూచుకొంటూ, భర్త భవిష్యత్‌ను తలపోస్తూ గుండెలు పగిలేటట్లు ఏడ్చేది -

తన భర్త తనని కొట్టి, తిట్టి, హింసిస్తున్నాడని ఏనాడూ బాధపడలేదా యిల్లాలు. మహాఘోరమైన త్రాగుడికి అలవాటైతన భర్త ఏమౌతాడో! దుస్సాంగత్య ఫలితంగా అతనిలోని వ్యాధులు చివరికి అతని నేపరిస్థితికి తీసుకుపోతాయో: అని విలపించేది. ఆమె అభావతోనే మానసికవేదనతో ఆమె చిక్కిశల్యమైపోయింది. ఆమెలోని సౌందర్యం, యవ్వనం నామరూపాలు లేకుండా అడుగంటాయి. తన్ను గురించి తను బ్రతక్కపోయినా పరవాలేదనే నిర్లక్ష్యంతో తన్నుతాను నాశనంచేసుకున్నా, ఉజ్వలభవిష్యత్తున్న తన బాబుమాత్రం అభివృద్ధికి రావాలని ఆశించేది -

ఒకనాడు బాబుకి కొంచెం జ్వరంవస్తే ఆవీధినే వున్న రామయ్యగారనే వైద్యుని దగ్గరకు వెళ్లి మాత్రలుతెచ్చి వేసింది శ్యామల. వారంరోజులు బాబుకు జ్వరంతోవుంటే ఒక్కనాడైనా ముకుందరావు గుమ్మంలోకిరాలేదు - శ్యామల ఒంటరితనాన్ని గుర్తించినిరామయ్య మాత్రం మందుకు లోటుచెయ్యకుండా కనశక్తి వంచనలేకుండా వైద్యం చేస్తున్నాడు - రామయ్యకూతురు అనసూయ కూడా రాత్రిబగళ్లు శ్యామలకు సహాయంగావుండేది.

నెలరోజులైనా బాబుకు వచ్చిన జ్వరం తిరుగుముఖం పట్టలేదు. మధ్య మధ్య "నాన్న" అనికలవరిస్తూ శ్యామలకి గుండెల్లోగునపంతో పొడిచినట్లుగావుంది. రామయ్య అనసూయ మాత్రం యేం చెయ్యగలరు -?

ఆ రాత్రి కాళరాత్రి - భయంకర రాత్రి. మరపు రాని రాత్రి. ఆ పూరింట్లో గుడ్డిగా వెలుగుతోంది ఒక బుడ్డి దీపం, నులకమంచంమీద బాబును ఒళ్లో పెట్టుకుని కూర్చుంది శ్యామల. అనసూయకి కూడా లోకానుభవం అంటే ఏమిటో తెలియకపోయినా, ఇంకా భర్త, కాపురం, వివాహం అంటేకూడా అర్థం చేసుకోలేని అమాయకురాలైనా శ్యామల స్థితిని గుర్తించాక జీవితాంతం కన్యాత్వంలోనే గడుపుదామనేటంత విరక్తిలోకి వచ్చింది. ముకుంద రావుని మనస్సులో శతసహస్ర శాపనార్థాలు పెట్టుకుంటూ, శ్యామల స్థితికి విచారపడ్తూ, బాబు ఎల్లా వుంటాడో అని ఆదుర్దాతో ఆమెకు సహాయంగా కూర్చుంది అనసూయ—

పెద్ద డాక్టరును తీసుకొస్తేనే కాని బాబు బ్రతకడని రామయ్యకు తెల్సు. అయినా తనేం చెయ్యగలడు? తను ఏవో ఆయుర్వేదమందులు కొన్ని తెచ్చుకుని, చిన్న చిన్న జబ్బులకు వాడుతూ, దానివల్ల వచ్చే డబ్బులోనే తనూ, తనకూతురు అనసూయా జీవయాత్ర చేస్తున్నారు. అనసూయకు ఇరవై ఏళ్లువచ్చినా తను బీదవాడు కావడంచేతనే ఆమెకు పెళ్లికూడా చెయ్యలేకపోతున్నాడు. ఒకపూట వుంటే రెండో పూట భత్యానికి తడుముకోడే స్థితి రామయ్యది — తను చెప్పినాకాని పెద్ద డాక్టరు రాడు. ఫీజు ఇవ్వందే పిలుస్తేకూడా పలుకడు. ఇంక ఏమీ చెయ్యలేక బాబు ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు.

"నాన్న" అని కలవరించాడు బాబు. కళ్లువిప్పి చూచి అమ్మా నాన్న అంటూ మళ్లీ కళ్లుమూశాడు. శ్యామలకి ఏటూ పాలుపోవడం లేదు. క్షణక్షణానికి జ్వరతీవ్రత హెచ్చిపోయి, బాబు నాన్న, నాన్న అని తెగకలవరించేస్తున్నాడు — తన భర్తని తీసుకు రావాలని రామయ్య వెళ్లాడు. కాని గుమ్మందగ్గర నుంచే అతన్ని సాగనంపేరు. చివరకు అనసూయ కూడా సాహసించి వెళ్లింది — శ్యామల దుఃఖం చూడలేక. ఆమెను గేటుదాటి లోపలికి రానివ్వలేదు — రామయ్య, అనసూయ కలిసివెళ్లి పెద్ద డాక్టరును కూడా వేడుకున్నారు. అధమం అయిదు రూపాయిలైనా ఇస్తేకాని చూడ్డానికే రానని భీష్మించుకు కూర్చున్నాడు పెద్దడాక్టరు. చిట్ట చివరకు శ్యామలకు చెప్పాడు రామయ్య—

శ్యామల దృష్టిలో తన కొడుకును బ్రతికించగల వాడొక్క డాక్టరు మాత్రమే - తన బాబును కాపాడే దేవతామూర్తి డాక్టరే - ఆ డాక్టరుకి అయిదు రూపాయలివ్వాలి అవి తనకెల్లా వస్తాయి? తన మెడలోని పవిత్రమాంగల్యాలు కూడా భర్త బలాత్కారంగా తీసుకుపోయి త్రాగుడికి ఆహుతి చేశాడు. ఇంక తనేం చెయ్యాలి? వెళ్లి డాక్టరు కాళ్లమీద పడి వేడుకుందామని తనే వెళ్లి డాక్టరు గారి తలుపులు తన శక్తికొద్దీ బడబడా కొట్టి నోరు నొప్పి పెట్టేవరకూ అరిచింది. కాని ఇలాంటి అభాగినుల పిలుపుకి ప్రయివేటు డాక్టరు తిరిగి జవాబైనా ఇవ్వలేదు. చివరకు విసుగెత్తి తనబాబు దగ్గరకి వచ్చింది శ్యామల.

బాబు పరిస్థితి బాగా వృతిమింపోయింది. విపరీతంగా మూల్గుతున్నాడు. ఆ మూల్గులోనే "నాన్న" అని అంటున్నాడు అస్పష్టంగా. "అక్కయ్యగారూ! ముకుందరావుగారు వస్తే ఎల్లాగైనా డాక్టరుని తీసుకురాగలరు. ఈ ఆఖరుసమయంలో బాబుని..." ఇంక చెప్పలేకపోయింది అనసూయ

"ముకుందరావుగారి దగ్గర ఎంతటి వాళ్లనైనా వశపర్చుకొనే సామర్థ్యం వుంది. ఆయన వస్తే బాబు జీవించవచ్చు" అన్నాడు రామయ్య

ఇంక బాబు విషయంలో వారిద్దరూ అల్లా చెప్పేసరికి శ్యామల మనస్సు తల్లడిల్లిపోయింది. అరిచింది. ఏడ్చింది-అందరు దేవుళ్లను ప్రార్థించింది. భర్త!... ఆమెకున్న ఆశ ఇంక అదొక్కటే... ఆ చీకట్లో చిన్న ఆశాకిరణం...అదే-తన కందుబాటులో లేని పెద్దమేడలో పై అంతస్థుమీద తనభర్త ఆ రాణీ ఆనందబాహువుల్లో హాయిగా నిదురిస్తూంటాడు... ఒక్కసారిగా బాబు ముఖంలోకి చూచింది. "న...న్న..." అని ఒణికే పెదవుల్తో అస్పష్టంగా అంటున్నాడు బాబు.

"బాబూ! మీ నాన్నని తీసుకువస్తా! నిన్ను బ్రతికించుకుంటా!! నాయనా!!!" అంటూ అరిచింది. ఇంక ఆ తల్లి వెనకాముందూ ఆలోచించలేదు. ఆమె మాతృప్రేమకి కటిక-చీకటి కూడా అడ్డు రాలేదు - విడిపోయిన జుట్టుకూడా ముడి వేసుకోవాలన్నా గుర్తుకూడా ఆమెకు లేదు.

ఒక్క పరుగున ఆ పెద్దమేడ దగ్గరకు వచ్చింది. ముందు గేటుకు పెద్దతాళం వేసివుంది. అయినా ఆ

తలుపులు తాళంకూడా పసివాడి ప్రాణంకోసం పోరాడే ఆ బీద అమాయకురాలి మాతృప్రేమకు అడ్డు రాలేకపోయాయి - ఎంతమాత్రం సంకోచించకుండా ఒక్క వూపున ఇనప ఊచలు పట్టుకు గేటుపైకి ఎక్కి లోపలికి దూకేసింది వీధి గుమ్మం తలుపు గబగబా బాదుతుంటే అక్కడే చాపమీదపడి గురకపట్టి నిద్రపోతోన్న నౌకరు లేచి ఎవరు వారు? అన్నాడు.

"వీధి తలుపులు తీయించు . ముకుందరావుగారు కావాలి" అంది శ్యామల

"ఇప్పుడేంటమ్మా! అర్ధ రాత్రి వేళ - నిద్దర్లో వున్నారు" అన్నాడు అతడు కళ్లు నులుపుకొంటూ.

"వారి అబ్బాయి చాలా జబ్బుగా వున్నాడు. వారిని త్వరగా తీసుకెళ్లాలి" అంది ఆతృతగా.

"ఏమో! ఆ గొడవేంటో నాకేం అక్కర్లేదు. పొద్దున్నగాని అరు లెగరులెండి" అన్నాడు అతడు విగ్గరగా.

"మా బాబుకి చాలా జబ్బుగా వుంది. ఆయన కోసం కలవరిస్తున్నాడు. నేను ముకుందరావుగారి భార్యను. ఒక్కసారి లేపు నాయనా!" దీనాతి దీనంగా వేడుకొంది ఆమె.

"అసలు అర్ధరాత్రికాడ లేపితేనే అమ్మగారూరు కోరు. అందులోనూ ఇక్కడ కొచ్చేవోళ్ల పెళ్లాలంటే ఇంకేవన్నా వుందా! అగ్గయిపోతారు నా మీద. నా కూట్లో దుమ్ము పోసుకోలేను అమ్మగారూ - పొద్దున్నే రండి" అని చెప్పాడు.

"సరే! అల్లాగైతే నేనే లేపుతానులే" అంటూ తలుపు గబగబా గుద్దడం ప్రారంభించింది శ్యామల.

"అయ్యో బాబయ్యో బాబో! ఆరూరుకోరండి. నన్ను సంపేత్తారమ్మగోరో! అసలు గేటు తలుపే తియ్యనివ్వరు మీరెల్లాగొచ్చారో ఏంటో!" అంటూ తల్పు తట్టుతూన్న ఆమెను వారించబోయాడు.

"ఏయ్! దూరంగా వుండు" అంటూ గర్జించింది ఆమె.

తన యావచ్ఛక్తిని వినియోగించి తలుపులు బ్రద్దలయ్యేటట్లుగా చాలాసేపు బాదిన తర్వాత "ఎవరు వారు?" అంటూ ఓ ముసలమ్మ వచ్చి తలుపుతీసింది.

"ముకుందరావుగారు ఎక్కడున్నారు?" ఆతృతగా అడిగింది.

"మీరెవరు? ఎందుకోసం వచ్చారు? ముకుందరావుగారితో మీకేం పని?" అంటూ అనేక ప్రశ్నలు అడిగింది ఆ వృద్ధురాలు.

ముకుందరావుగారి భార్యను మా బాబుకి జబ్బుగా వుంది. త్వరగా వారు రావాలి" అంది గాభరాగా.

"ఇందుకా అర్ధరాత్రివేళొచ్చావు? ఇంకేం వంక దొరక్క కొడుక్కి రోగం అని ఆయన్ని తీసుకుపోవడానికా? చాలుచాల్లే! సంసారివి కావూ?" అంటూ సణుగుడు ప్రారంభించింది ఆ వేశ్యమాత.

"ముందాయన ఎక్కడున్నారో చెప్పు?" గట్టిగా అడిగింది.

"చెప్పకపోతే ఏం చేస్తావేమిటి నన్ను? ఈ అర్ధరాత్రివేళ అరవబోకు! తిన్నగా వచ్చిన త్రోవనే మంచిగా వెళ్లు. కావాలంటే రేపొద్దున్నే వచ్చి నీ మొగుణ్ణి నువ్వు తీసుకువెళ్లొచ్చు" అంటూ సాగదీసుకొంటూ అభినయంతో సలహా చెప్పింది వేశ్యమాత.

"ఇప్పుడు వారిని తీసుకువెళ్లకుండా నేనిక్కడ నుంచి కదలను _ చెప్తావా? చెప్పవా?" అంటూ గర్జించి అడిగింది.

"ఇంగో అమ్మాయ్! మర్యాదగా చెప్తున్నాను వెళ్లిపో _ ఇది మంచి నిశిరాత్రివేళ . హాయిగా మేడమీద నిద్దరపోతున్నాడు. ఈ రాత్రికి నీ మొగుడెక్కడికీ పారిపోడులే - వెళ్లు _ వెళ్లు" అంటూ చీదరించుకొంటూ చెప్పింది

"తప్పకో మేడమీదికెళ్లి లేపుతాను" అని తీవ్రంగా అంది.

"వీల్లేదు _ నువ్వీ గడపదాటి లోపలికి రావడానికి వీల్లేదు మనిషికి ఓసారి చెబితే చాలదూ?" కోపంగా అంది వేశ్యమాత.

"మనిషిని కని బట్టి కన్నకొడుకు ప్రాణంమీదికి వస్తే కట్టుకున్న భర్తకోసం నీ యింటికి వచ్చాను. వారిని పంపించు" అంది ప్రాధేయతగా.

"ఇప్పుడు మాత్రం అమ్మాయికి నిద్రాభంగం చెయ్యడానికి వీల్లేదు . పొద్దున్నే లేపి పంపుతానులే" నక్క వినయంతో చెప్పింది.

"నా బాబుకంటె నీ కూతురు నిద్ర చెడిపోతే మరేం ప్రమాదంలేదు" అంటూ గుమ్మానికి అడ్డంగా నిల్చున్న ముసలి వేశ్యమాతను ఒక్క గెంటుతో ప్రక్కకు నెట్టి రివ్వున ఇంట్లోకి జొరబడింది. నాల్గువైపులా వెదికి మేడమెట్లున్న గదిలోకి వెళ్లి గబగబా మేడ ఎక్కేసింది _ తిన్నగా పడకగది తలుపులు ఢడీఢడీ బ్రద్దలు కొట్టేటట్లు కొట్టింది. "ఎవరు?" అంటూ రాణీ లేచివచ్చి తలుపు తీసింది.

(సశేషము)

# సాక్షాత్కారము

విద్వాన్ శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ

నీలపు జర్మమున్ దనువునిండఁగ. దండకమండలంబులన్
దాలిచి, శుద్ధరూపమున ధాతమహోజ్వల తేజమోయనం
జాలి, శరీరముంబడయఁ జాలిన యవ్విధిచర్యమోయనం
జాలు తపస్వియొండు నగజాస్థిత సంస్థలిఁ జేరఁ జేరినన్.

ఆముని గాంచి యానగజయత్యధికంబుగ గౌరవింప. ను
ద్దామముగాఁ దదర్చనల ద్రవ్యములంగడు సత్కరింపఁగా,
నాముని తత్సపర్యలరయుంబునఁ బ్రీతినిస్వీకరింపుచా
హైమవతీ ముఖాంబుజమునారసి నిర్మలవీక్షణంబులన్

బాలతపస్వినీమణి! తపంబు వినిశ్చలలీలసల్పఁగాఁ
జాలిన శీలముంగలిగి శక్తినిమించక సల్పుచుంటివే?
చాల భవన్మనోనియమ సంపదమౌని గణంబు కేనియున్
వీలగునే? లభింపఁ బృథివీధరపుత్రి! తలంపఁగామతిన్.

హోమాదికార్యాల కొనరునెసతతంబు। సమిధకుశచయంబు చంద్రవదన।
అంబువుల్ స్నానయోగ్యంబులై నిర్మ। లంబులగుచునున్నె? యతివమిన్న!
పల్లవుష్పంబులు పల్లవంబులు నీకు సులభంబుగ లభింపుచున్నె! రమణి!
అంతువులన్యోన్య జాతివైరమువీడి సంచరించునె? మృదుచంచలాక్షి!

శక్తికొలఁది తపంబును సలుపుచుంటె!
ఫలమునందున వాంఛలవదలి వైచి
ధరణినందున ధర్మసాధనములందు
నరయ దేహసాధనమె ముఖ్యంబుగాదె!
అఖిలలోకాల కేలికయబ్జభవుని
యన్వయంబునఁ బుట్టిన యట్టిదాన
వమితలావణ్య సంపదలావహిల్లి
పరమునిష్ఠల కేల పాల్పడితివబల!

అనుకూలవరునికై యాశించినావన్న రత్నంబొరులఁ జేరయత్నపడునె?
వరదేవలోకంబు వాంఛించినావన్న జన్మస్థలం బుతిత్సమమెకాదె?
పుట్టింట నవమానముంగల్గినన నేరు ఫణిఫణా గ్రమణికి వాంఛపడును?
భర్తృపరాభూతవనుచుఁ దలఁపంగ । మదినదినీయందు నొదవకుండు.

సతతమిటులఁ దపంబును సలుపనేల?
తాపసులకిది నిజముగాఁదగును, తగునె?
యాయనాఘ్రాతసుమసమ ప్రాయవయన
నీకు, నేటికీ వ్యర్థాశ నీరజాక్షి!

ఏడు మాటలనాడిన నేరికేని
గాఢసుస్నేహసంపద దగులుగనున్న
యందునవయావ్వనాంగివి యైననిన్నుఁ
గనికరింపరే? ,యవరేనిఁ గాంచిరేని.

ఏ నొకమాట దెల్పెద, మఱింతకు నన్ననినంత సత్కృపన్
మానస మొప్పుచుండె, వినుమానిని। నీవునుగన్య వెంతకా
లానకుఁ బెండ్లిగోరుట ఫలంబుగునేనియు బ్రహ్మచారి నేఁ
గాన వివాహమాడునను, గల్గుసుఖంబులునీకు, నియ్యెడన్.

అటులఁ గాదేని, మత్తపంబందునీకు,
నర్ధభాగంబొ సంగెదనంబు జాక్షి!
యింకనీతపో వృత్తి వర్జించి వైచి
ప్రాయమునకుఁదగు సుఖమ్ముఁబడయుమిమ్మ.

అటుల నాకు హనావటుండనిన వినియుఁ
దనమనోరథము వచింప మనసుపడక
సఖియు దెలుపఁగ, గిరిజతన్ముఖముగాంచెఁ
దీవ్రతరమైన లజ్జమతినిఁ గలంప

ఆ తప హారణంబునకు నంబుజమున్ వినియోగమానటుల్
ఈ తనువున్ దపంబునకు నిట్లుపయోగముసేయు చుండెడిన్.
శ్రీతిమహేంద్ర దిక్పతులనేని గణింపకయామె యోగియా
భూతపతిన్ వరించె, మునుఁ బొందినవుష్పశరాహతిన్మతిన్''

నాటి మొదలు గనీశసంతప్త
యగుచు శాంతిమనంబున నమరలోక,
యోగనియమ నిష్ఠుండగు నుగ్రశివుని
నిజతపోనిష్ఠఁబడయఁగ నిశ్చయించె.

పరమేశున్ హృదయేశుగాఁబడయఁగా వాంఛించి, యిట్టీ తప
స్ఫురణన్ మున్గె మహామహుండు, ఘనుఁడా, భూతేశుఁడే నాటికిం
గరుణంబూనునో? యంచు, మాసఖపయింగా సిల్లు నుల్లంబు మా
కెలుగందెల్లముగాక, నదియొక్కింతేని నిక్కంబుగన్

అనుచు నిజసఖి పలికిన, నాతఁడందు
నాత్మనందియ పడుచున్నయటులనరసి,
కపటభూసుర వరుఁగాంచి, కడకునుడివె
సత్యసత్తపోగుణ జాలశైలబాల.

---

# వివేకం-విజ్ఞానం

## సేకరణ: చామర్తి సుబ్రహ్మణ్యం

1. ప్రామాణిక మానవుడే అఖిలేశ్వరుని అత్యుత్తమ సృష్టి.
—"పోప్"

2. ఏకాకిగా నిలబడగలవాడే ప్రపంచంలో అమితబలుడు.
—"ఇబ్సన్"

3. తక్కువగా తెలిసికొని ఎక్కువగా అర్థం చేసికోవడము వల్లనే స్త్రీలు పురుషులకన్న తెలివిగలవారిగా పరిగణింపబడుతున్నారు.
—"జేమ్సు స్టీఫన్సు"

4. మనము ఒకేఒక వస్తువుకు భయపడవలసి ఉంది. అదియే ఆత్మభీతి.
—"ఫ్రేంక్లిన్ డి రూజువెల్టు"

5. జ్ఞానము వచ్చేది. వివేకము నిలిచేది.
—"టెన్నిసన్"

6. మానవ స్వాతంత్ర్యమునకు గౌరవముండని చోటనే వీరపూజ అధికముగా ఉంటుంది.
—"హెర్బర్ట్ స్పెన్సర్"

7. మోహ, స్వార్థాలు అజ్ఞానుని తనయులు గనుకనే అజ్ఞానులు, దుష్టులుగాను, పిరికివారుగాను ఉంటారు.
—"గాంధీజీ"

8. సత్యము పలుకనంతవరకూ మానవుడు ఈశ్వరుని పొందలేడు. ఏలనన ఈశ్వరుడు సత్యాత్మ.
—"రామకృష్ణపరమహంస"

9. క్రోధంతో స్వాధీనం తప్పినవాడు మృతతుల్యుడు, కాని క్రోధమును త్యజించినవాడు విరాగితో సమానుడు.
—"తిరువళ్వార్"

10. సర్వేంద్రియ విజేతయే క్షుత్ పిపాసలనుండి రక్షింపబడగలడు.
—"సుకరాత్"

11. ప్రేమించేవాడికి దండించే అధికారముంది.
—"రవీంద్రుడు"

# నవ్వుకు కారణాలు

(రచన: విన్‌ఫూల్)



"జిహ్వాకో రుచి...". ఒకరికి ఒక మాట చెబితే నవ్వుతారు. అదేమాట మరొకరికి నవ్వు పుట్టించకపోవచ్చును. విదూషక శిఖామణులకు ఈ రహస్యం బాగా తెలుసును. ఎవరిలో ఎప్పుడు ఏ మాట హాస్యరసాన్ని పుట్టిస్తుందో, ఎవరిలో ఎప్పుడు ఏ మాట విరసం కల్గిస్తుందనేది విదూషకులు తెలుసుకోవలసిన ముఖ్యసూత్రం. విదూషకులకే కాదు మానసిక శాస్త్రవేత్తలకూ ఇదొక ముఖ్యసిద్ధాంతమే.

మానవులు తాము చేసేపనులు చూచి తామే ఎందుకు నవ్వుకొంటారు? ఒకమాట చెబితే ఒకరు విరగబడి నవ్వుతారెందుకు? అదేమాట విన్న మరొకరు నవ్వకపోగా మూతి ముడుచుకొంటారెందుకు? మానసిక ప్రవృత్తికి సంబంధించిన ఇటువంటి ప్రశ్నలకు జవాబులు రాబట్టటానికి అమెరికాలో జాన్ హాప్కిన్స్ విశ్వవిద్యాలయ పట్టభద్రులొకరు పరిశోధన జరుపుతున్నారు.

డాక్టర్ జాన్.స్ట్రిక్లాండ్ అనే ఆయన ఇదివరకు జాన్స్ హాప్కిన్స్ విశ్వవిద్యాలయంలోనూ, ప్రస్తుతం శాండియాగోలో అమెరికన్ నేవీ ఎలెక్ట్రానిక్స్ లేబరేటరీ తాలూకు మానవ అంశాల విభాగంలోనూ ఈ పరిశోధన జరుపుతున్నాడు. "వేరు వేరు సందర్భాలలో వేరు వేరు వ్యక్తుల ప్రవృత్తిమీద విభిన్న సంఘటనలు కల్గించే ప్రభావాన్ని కనుగొనటం" ఈ పరిశోధన ధ్యేయం.

"పరిసర వాతావరణ పరిస్థితులనుబట్టి మానవులకు నవ్వుపుట్టించే కారణాలు మారుతుంటవి" అని డాక్టర్ స్ట్రిక్లాండ్ ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

ఉదాహరణకు ఒకమనిషి బాగా కోపంగా, భయంతో కంపిస్తూ దాన్ని వెళ్లబోసుకొనే మార్గం లేకుండా ఉన్నాడనుకోండి. అటువంటి పరిస్థితుల్లో ఉన్నమనిషి దానికి సంబంధించిన సంఘటనలతో కూడిన హాస్యమైతే అదిచూచి, విని ఆనందించగల్గుతాడు, అని డాక్టర్ స్ట్రిక్లాండ్ ఉదాహరణ ఇచ్చాడు.

"అట్లాగే కామోద్రేకి అయిన వ్యక్తి ఆ వాంఛ తీర్చుకొనే అవకాశంలేని స్థితిలో ఉన్నప్పుడు లైంగిక సంబంధమైన హాస్యంలో అనుభూతి పొందగల్గుతాడు" అంటాడు డాక్టర్ స్ట్రిక్లాండ్.

డాక్టర్ స్ట్రిక్లాండ్ ఈ పరిశోధన ఎట్లా సాగించాడు?

ఆయన కొన్ని కార్టూన్లు సేకరించాడు. వీటి విషయంలో అనుభవంగల 15 మందికి వీటిని చూపి వారంతా నిజంగా హాస్యం ఉట్టిపడుతున్నాయని ఒప్పుకొన్న 33 చిత్రాలను వాటిల్లోనుంచి ఏరుకొన్నాడు. వీటిని మూడు వర్గాలుగా విభజించాడు. ఒక 11 చిత్రాలు విరోధభావం, దౌర్జన్యభావాలు ప్రాతిపదికగా చిత్రించినవి; ఇంకొక 11 సాధారణ విషయాలకు సంబంధించినవి, మరొక 11 లైంగిక విషయ ప్రధానంగా చిత్రించినవి.

ఆ తరువాత డాక్టర్ స్ట్రిక్లాండ్ జాన్స హాప్కిన్స్ విశ్వవిద్యాలయంనుంచి 75 మంది విద్యార్థులను ఎన్నుకొన్నాడు. 25 మంది చొప్పున మూడు బృందాలుగా వాళ్లను విభజించాడు.

మొదటి బృందంలో విద్యార్థుల్ని ఒక్కొక్కర్ని ఆయన తన ఆఫీసుకు పిలిచాడు. ఒక్కొక్కరికి ఈ 33 కార్టూన్లు చూపి అందులో వాళ్లకు హాస్యంలో బాగా నచ్చినవాటిని ఆ వరసలో చెప్పమని కోరాడు.

ఆ తరువాత రెండో బృందంవాళ్లని ఆయన పిలిచాడు. వీరి విషయంలో డాక్టర్ స్ట్రిక్లాండ్ మరొక పద్ధతి అవలంబించాడు. వీళ్లని బాగా అవమానపరిచే మాటలన్నాడు. వాళ్లకు వేరే పనులున్నా పోనీయకుండా 20 నిమిషాల సేపు అక్కడే ఉంచాడు. మొత్తంమీద వాళ్లకు విసుగు, కోపం కల్గేటు చేశాడు. వాళ్లకి ఈ కార్టూన్లు చూపి ఏవి బాగున్నవో చెప్పమన్నాడు.

ఇక మూడో బృందం విద్యార్థులకు, తాను కళకు, కామానికి ఉన్న సంబంధాన్ని గురించి పరిశీలన

జరుపుతున్నానని ముందుగా చెప్పి ప్రతి విద్యార్థికి చవులూరించు జవనుల గిలిగింతలు పెట్టే బొమ్మలు చూపాడు. తరువాత వీళ్లకి కార్టూన్లు చూపాడు.

ఈ పరీక్షవల్ల తేలిన ఫలితాలు సరిగ్గా డాక్టర్ స్ట్రిక్లాండ్ అనుకున్నట్టే తేలినవి. అవమానానికి గురిచేయబడిన బృందంలోనివారు విరోధభావములో దౌర్జన్యపూరితంగా కనపడిన కార్టూన్లను మెచ్చుకొన్నారు. అమ్మాయిల బొమ్మలు చూసిన విద్యార్థులు కళ్లకి లైంగిక సంబంధమైన కార్టూన్లు బాగా నచ్చినవి. మొదటి బృందం విద్యార్థులు ప్రత్యేకంగా ఒకతరహా కార్టూన్లను మాత్రమే ప్రేత్తి చూపటం జరగలేదు. వాళ్లకంటికి అన్ని కార్టూన్లు బాగానే ఉన్నాయి.

"ఈ పరిశోధన ఫలితాలకి రెండు ప్రాముఖ్యాలున్నాయి: మొదటిది — మానవుని హాస్యానుభూతి పరిస్థితులననుబట్టి ఎంతగా మారుతుంటుందో దీనివల్ల తేలుతున్నది. రెండవది — 'ఒక వ్యక్తిని మానసికంగా వేరువేరు విపర్యయాలకు లోను జేయటంద్వారా అతని హాస్యానుభూతిని ఎట్లా చాలవరకు అదుపులో పెట్టవచ్చునో దీనివల్ల స్పష్టమవుతున్నది" అని డాక్టర్ స్ట్రిక్లాండ్ సారాంశం చెప్పాడు.

---

స్టూడియోలో షూటింగ్‌కు ఏర్పాటులు సిద్ధమయ్యాయి. లైట్స్ వెలిగాయి, కెమారా స్విచ్ ఆన్ చేశారు. హీరో, హీరోయిన్‌లు నవ్వుతూ నడిచి వెళ్లాల్సిన సన్నివేశం. కాని హీరోయిన్ భోరున ఏడ్వసాగింది. డైరెక్టర్ 'కట్! కట్!' అని అరుస్తూ ఆమె దగ్గరకు వెళ్లి "నవ్వుతూపోవాలనియింత సేపూ చెప్పితే ఏడుస్తున్నావేమిటి'' అని అడిగాడు.

"నేను నటించే ఆఖరు చిత్రమిదే. మావారు నన్నిక సినిమాలలో నటించవద్దన్నారు - అది తలపుకొచ్చి దుఃఖము భరించలేక ఏడ్పొచ్చింది" అన్నది కండ్ల నీళ్లొత్తుకుంటూ.

వేముల కుటుంబరావు

# ఆత్మనివేదనము

సాహిత్యసరస్వతి శ్రీ సీరిపి ఆంజనేయులు

(గత సంచిక తరువాయి)

అట్టిచో నద్భుతంబౌ పెనువాన
వచ్చుటయును, దాన వఱద సొచ్చుటయు,
నీరు తటాకంబునిండి పొంగుటయు,
గంగాభవాని యంగనఁ గోరుటయును,
గుమ్మడపడుటయు, గోడవమీఱుటయుఁ,
తల్లులు పిల్లలు దద్దఱిల్లుటయు,
గ్రామమ్ము గంగమ్మ కబళించువనెడు
నలజడి ప్రజలలో నగ్గలించుటయు,
వారికొండలము నేవారు నడంప
కుంటయు, దినగండ మొక వేయియేండ్ల
యాయువుగాఁగ నూహకుఁ దట్టుటయును,
నేకాంతగతి నున్నయెడ మసలమ్మ
తలపోసి, యంతఁ గర్తవ్యాంశ మెదయొ
యిదమిత్థమని నిశ్చయించి నెమ్మదిగ,
నత్తయు మామయు ననుఁగు బావలును
మగఁడును జింతానిమగ్నులై, యింట
నొక్కడఁ గూర్చుండియుండ, నచ్చటికిఁ
జని, యెల్లరకు నమస్కారముల్ సల్పి
యనువొప్ప వారిపజ్జను గూరుచుండి
వినయంబు దనర నిట్లనె మామఁగనుచు-

"పితృసదృశులు మీరు; బిడ్డను నేను;
ఆత్మసంశయము మిమ్మడుగవచ్చితిని.

"ఎవ్వరికృప మన మింతకాలంబు
హాయిగ మనుచుంటి మా జగదంబ
యే పున నేఁ డొక్కయెడ దప్పతిల్లె
నిప్పుడో యెప్పుడో యేక్షణమ్మునవో
కట్ట తెగెడు ; నంత గడియలోపలనె
యూరు మునింగెడు; నొకమొగి నిన్ని
యాత్మలు గంగ కాహార మౌ; నిజము ;
ఇద్దానిఁ గూర్చి యోచింప రొక్కరును.
"ఇది యల్పవిషయమ్మె? యిటు లుంట
తగునె?
యుక్తమ్మె మనకిటు లొప్పరికింప?
నీ యుపద్రవముఁ దప్పింతు రెవ్వారు?
మన పురజనులకు మనుగడ యెద్ది?"
బసిరెడ్డి — కోడలి పల్కులలోనఁ
గల ధర్మసూక్ష్మమ్ము గనిపట్టి, దాన
నబ్బురమంది మాటాడకయుండె.
మెలఁతుక యవల నిమ్మాయి విన్నవించె-
"మనము పాలకులము. మనప్రజల్ వారు;
వారలఁగాపాడు భారము మనది ;
మనయండ నమ్మి నెమ్మదినుండు జనుల
కొకకీడు రాకుండ నొప్పరికించి
మన మూరకుండుట మంచిదిగాదు;
వారి సౌఖ్యముగోరు వారల మగుట,
మన సాహసమె వారి మనుగడ యగుట
నదియేని దలపోయ నిదియుదనగును."
రమణి వాక్యముల మర్మము లోనెఱింగి,
యామె ధర్మోక్తికి నాత్మనుప్పొంగి,
దాని సాధించు సాధనమును గూర్చి
బసి రెడ్డి చింతింపఁ బడఁతి యిట్లనియె-
"తండ్రి! సనాతన ధర్మమార్గమున
నాత్మనివేదన మతిపూతమగుచు,
నానంద దాయకం బగుచు వర్తిల్లు;

దాని మన్నించుటుత్తమనీతియంచు
నను బ్రబోధించుచున్నది నా మనమ్ము;
జగదీశునాన దానిగ నెన్ను దాన;
నాత్మసంబుద్ధి ద్రోయంగలేనిదాన;
నదె మీకు నొప్పిద మనుకొనుదాన.
"కోడండ్రు మీకు నేడ్గురు వారిలోన
గడగొట్టుదానను; కడుఁ బసిదానఁ;
గాఁపురంబును దిద్ద నోపనిదాన;
జనులయంగదఁ జూడఁ జాలనిదానఁ,
గంగమ్మ తల్లిని గననెంచుదాన;
ననురక్తి ననుఁబంప నర్థించుదాన;
ఘనభక్తి మీ యాజ్ఞఁ గాంక్షించుదాన."
ఈనుడుల్ వినంతనే బసిరెడ్డి
కొడలు జలదరించె; నోడె జీవములు;
గుండియ వ్రేఁగయ్యె; ఘూర్ణిల్లె మనము;
దిటవుదప్పెను బుద్ధి; దీమసమ్మడలె,
నామె సాధుచరిత్ర మంతయు నెదుట
సాక్షాత్కరింప నా సౌమ్య శీలునకుఁ
గెరలి కన్నుల నీరు గిఱ్ఱునఁ దిరిగె.
మగువ దానినెఱింగి మగుడ, నిట్లనియె —
"ఇట ధర్మములఁ దెల్ప నే నెంతదాన?
ప్రజ్ఞాప్రబోధమ్ము వచియింతు నంతె;
యీ యల్ప జీవికై యిటు వెతగూర
మేలగునే? మాన్య! మేల్మియాదారిఁ
జింతింపఁదగుఁ; బురశ్రేయోభివృద్ధిఁ
గోరెదుమీకు నీ కూన యేపాటి?
వందల వేల జీవములఁ గాపాడ
నొక బుడుతను దల్లి యొడి నిడలేరె?
యీ జగత్కల్యాణ మెంచియు కాదె
సకలలోకేశుఁ డొసంగె నిమ్మేను?
అట్టి యాప్రభుకాన్క నతని కర్పించు
భాగ్యంబు చేకుఱఁ, బరితృప్తిఁ బొందఁ
దగుఁగాని, తగని యీ తగులంబు తగదు!

పాలకులకు నీవి పరిపాటి యగుట
స్వార్థమ్ము విడనాడఁ జనదె రక్షకులు
అణిముత్తెములు చెన్నలరెడుమాడ్కి,
స్వచ్ఛత నెసఁగి మాల్యము గట్టునట్లు
జవరాలి వదనాంబుజమునుండి వెడలు
శమసహితములగు సాధువాదముల
పగతత్త్వ మెదను సంభావన చేసి
పిన్నమది నెలకొల్పు పృథుభావతతికి
బసిరెడ్డి నివ్వెఱపడి మిన్నకుండె;
నవల నచ్చెలువ యిట్లని పల్కఁదివిరె —
"స్వార్థపరత్వమ్ము సంపదగాఁగఁ
దిరముగ మనఁగను దేహమదెంత?
పరహిత భావము పాటింపఁ బోక
చిరసౌఖ్యములఁ గోరు జీవ మదెంత?
యీ యెల్ల దేహుల యిష్టార్థసిద్ధి
కెలమిఁదోడ్పడు దేహమే దేహమయ్య
యీ సర్వజీవుల యిరవు పెంపులకు
నొదుఁ బ్రాపగు జీవమే జీవమయ్య!
యీ దేహమది యెంత? యీ జీవమెంత?
మనపురజనుల కప్పనసేతునయ్య!
"అదె నాకు మంత్ర; మయ్యదె నాకుఁ దంత్ర;
మదె నాకు భోగ; మయ్యదె నాకుఁ ద్యాగ;
మదె నాకు రాగ; మయ్యదె నాకు యోగ;
మదె నాకు రక్తి; యయ్యదె నాకు ముక్తి;
కాన నీ జన్మమ్ముఁ గడుఁ బ్రేమతోడ
సాగింపనిండు; నా సంతుష్టిఁ గనుఁడు."
మెలఁతపల్కుల నోర్మిమెయి నాలకించి,
యామె సాహసబుద్ధి కబ్బురంబంది
బసిరెడ్డి పరితృప్తభావుఁడై మిగుల
నామోదమును బొందె; నతని దుఃఖాశ్రు
లపుడ యానంద బాష్పాళిగా మాఱె

(సశేషము)

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

"నేను అక్కతో వెళ్లాను" అంది వెంటనే.

"ఎక్కడికి?"

"కుమార్‌బాబు యింటికి".

ఆమాటతో యోగేష్‌బాబుకి పెద్దదెబ్బ కొట్టినట్లైంది. "అక్కడ యేం జరిగింది?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఏముంది? టిఫిన్ పెట్టింది. అవిడ మాట్లాడుతూ కూర్చుంది. ఇంతలో కుమార్‌బాబు వచ్చాడు. వచ్చేశాం."

"అయితే కుమార్‌తో మాట్లాడిందా మీ అక్కయ్య?"

"లేదు. కాని కుమార్‌బాబే అక్కను గురించి కమలతో చెప్పాడు. అక్క అతణ్ణి యెప్పుడో గాడిద అందిట..."

"బాగా అంది... మీ అక్కను పిలు" అన్నాడు.

నీలి వెళ్లి నిరుపమను పిల్చుకు వచ్చింది. నిరు రాగానే ఆమెను చూచి నవ్వి "ఉత్తరం వ్రాస్తే నిరు జవాబియ్యలేదు" అన్నాడు యామినీబాబు. అని ఆమె యేమంటుందోనన్న అభిప్రాయంతో ఆమె కళ్లలోకి చూచాడు.

"ఉత్తరం వ్రాశాడా?... నాకు తెలీదు" అంది.

యోగేష్‌బాబు నవ్వి, "ఇది నీకు ఉచితంగానే వుంది" అని "ఊ. ఎల్లాంటి యిల్లు — ప్రజలు యేమనుకుంటున్నారు... ఏమిటో నిరు యెవ్వరి కూతురో నాకు తెలుసు" అనుకుంటూ తనలో తానే యేదో పణుగుకున్నాడు.

ఇదివిన్న నిరుపమకు భయంవేసింది. ఆమెలో అనుమానాలు రేకెత్తాయి. గట్టిగా సమాధానం చెప్తామా అనుకుంది. కాని అతడు చెప్పదల్చుకున్న దేమిటో చెప్పనేలేదు.

యోగేష్‌బాబు ఆలోచనగా ఆమెవైపు చూస్తూ మళ్లీ మొదలుపెట్టాడు. "వాడు హిందువుడే. అయితే యేం? ఆఖరికి భ్రష్టుడయ్యాడు. దేశద్రిమ్మరి. వీడే వాళ్లో ఎంతమందో మాదిగాళ్లు డాక్టర్లు అయి వుండవచ్చు. అంతమాత్రాన వాళ్లు కోటల్ని జయించలేరు. సమాజంలో యెలా వుండాలి? యెలా మెలగాలి – అన్న జ్ఞానమే లేదు. ఒంటరిగానే యీ ప్రపంచాన్ని విడిచిపోతాడు. ఎం. ఏ. చదివినవాళ్లు యెంతమంది లేరు? అంతా యిలాగే వున్నారా? పదిమందిలోను కలిసి మెలిసి వుండటం, పెద్దవాళ్ల ఆదరాభిమానాల్ని పొందటం – వీడికి వేమీ లేవు. ఎప్పుడూ ఒక్కడూ ఆకాశంలో విహరిస్తూ వుంటాడు. ఉన్నది కాస్తా అయిపోయింది. వాడంతట వాడే అందరికీ పరాయివాడయ్యాడు. వాడు ముట్టుకున్న నీళ్లుకూడ యెవ్వరూ త్రాగటంలేదు. ఇది బుద్ధిమంతుల లక్షణమే? ఎప్పుడైతే సమాజంలో వుండడానికి తనకు తాహతులేదని తెల్సిపోయిందో అప్పుడే తన తప్పును సరిదిద్దుకుని, తిరిగి సంఘంలో తన స్థానం పొందడానికి ప్రయత్నించాలి..." అంటూ నవ్వి, "ఇప్పుడు యిలావుంది మన సమాజం. తండ్రి చటర్జీ బ్రాహ్మణుడు. అలాగే చచ్చిపోయాడు. తల్లేమో యిప్పుడు మాదిగదయింది... ఇది ప్రపంచమని మనం చెప్పుతున్నాం. ఈ ప్రపంచంలోనే రకరకాల జీవులున్నాయి. అన్నిటిని దూరాన్నుండి చూడాలే కాని ముట్టుకుంటే మహాపాపం. ఇప్పుడు చూడు. ఇద్దరూ యెక్కడికో వెడుతున్నారు. వాళ్లు యెలా వెడతారో అట్లాగే కల్సుకుంటారు. అయితే కమల మనింటికి రావడం నాకిష్టంలేదు. మనలాటి వాళ్లు వాళ్ల దగ్గరికి వెళ్లకూడదు. మన పనేదో చూచుకుంటూ మన యింటిదగ్గరే పడి వుండాలి..."

ఈ ఉపన్యాసం నిరు హృదయంమీద దెబ్బకొట్టినట్లైంది. ఆమె యేమీ మాట్లాడలేదు. ఆమె మనసులో అనేక ఆలోచనలు పరుగెత్తుకున్నాయి. కుమార్, కమలల సంబంధాలు స్థిరపడిపోతాయేమో నన్న భయం ఆమెను ఆవహించింది. తాను మామను మొదట తప్పుగా అర్థం చేసుకుంది. కాని యీనాడు నిజం తెలిసింది. హిందూ[illegible]

భాగ్యసంపదలైతే ప్రచలితమై వున్నాయో అవి నిజమే. కుమార్ నైతే సహింపవచ్చు. కాని అతడి వైపు పెరుగుతున్న మనోప్రవృత్తులు సరైనవి కావు. అతడికి తనమీద ప్రేమ లేదేమో? అందువల్లనే తెలుసుండికూడ మూర్ఖుడందని అన్నాడు. ఈ ఆలోచనలతో తల్లడిల్లి దిక్కుతోచక, నెమ్మదిగా మామను పలుకరించింది. "ఎందుకు మామయ్యా పిలిచింది?"

అయితే ఆమెను యెందుకు పిలిచాడో ఆ విషయం మరిచిపోయాడు. ఇంతలో దాసీది వచ్చి యామినీబాబు వచ్చాడని చెప్పింది. నిరుపమ ఒళ్లు మండింది. అతడు నిజంగా డబ్బుకోసమే వచ్చాడు. ఈ డబ్బు విషయమంతా పరిహాసానికే అయింది చాలసార్లు. గాలిలో మేడలు కట్టుతున్న యామినీబాబును యెల్లాగైనా సరే విసిగించాలని, "ఎందుకు వచ్చాడు మామయ్యా యింత ప్రొద్దున్నే?" అంది.

యోగేష్ బాబు ఆమె ముఖంలోకి చూచి "యామినీబాబుకు కూడా వయస్సు వచ్చింది. పుట్ట మొదటనే నక్షత్రాలు, గ్రహాలు అన్నీ చూచాను... నన్నెవరూ మోసగించలేరు. నేనూ మోసపోను. జరుగబోయేదేమిటో నేను ముందే చెప్పాను. నా నిరు జీవితాంతం సుఖంగా వుంటుందని నాకు ముందే తెలుసు..." అంటూ యేదేదో చెప్పబోతూవుంటే యామినీబాబు వాళ్లో అడుగుపెట్టాడు. యోగేష్ బాబు మాటల్ని ఆపుచేసి వచ్చే యామినీబాబును ఆహ్వానించాడు. నిరుపమ మాత్రం అలాగే ప్రతిమలా — తన భావిభాగ్య చక్రాన్నిగూర్చి తలపోస్తూ హద్దులేని ఆకాశాన్ని కిటికీలోంచి చూస్తూ కూర్చుంది. ఆకాశాన్ని మూడ్డంలోవున్న ఆనందం దృష్టిని సారించడంలో వుందా? అయినా యీ చిన్నచిన్న బంధకాలవల్ల మనుష్యులకు యీ అనుబంధమేమిటో? ఎందుకీ అనుబంధాలు? కిటికీలోంచి ఆకాశాన్ని చూస్తున్న ఆమె కళ్లలోని నవీనకాంతిని చూచి ముగ్ధుడై ఆమెను చూస్తూనే యోగేష్ బాబుకు నమస్కరించాడు. యోగేష్ బాబు ప్రక్కన కూర్చోబోతూన్న యామినీబాబును చూచి వెళ్లిపోదామనే అభిప్రాయంతో లేచింది నిరుపమ.

"కూర్చో, నీతో పనుంది" అన్నాడు యోగేష్ బాబు. నిరుపమ ఆలోచనగా పైకిచూస్తూ కూర్చుంది. ఆమె భావనల్ని కనిపెట్టినవాడికిమల్లె "ఆకాశంలోకి చూచే రోజులు యింకా రాలేదు" అన్నాడు యామినీబాబు నవ్వుతూ. "ఇప్పుడు ఆకాశంలో తిరగడానికి విమానాలు వచ్చాయి. అక్కడ అంతా చూడవచ్చు. ఒకసారి వెళదామా, నిరూ?"

"అవును నిరూ. కొంచెంసేపు ఆకాశంలో తిరిగి రాకూడదూ?" అన్నాడు ముసలాయన.

మొదట ఆమె సిగ్గుపడింది. కాని మళ్లీ యేమనుకుందో "సరేలెండి. ఎప్పుడో ఒకరోజు వెళ్లి రావచ్చు" అంటూ "అయినా కిందనుండి పైకివెళ్లే అవుసరం యింకా రాలేదులెండి. మొదట మీరు ఈశ్వరునితో కొద్దిగా మాటలాడి సంధిచేసుకుందురు గాని..." అంది యోగేష్ బాబువైపు చూస్తూ. ఆమె దూరపాలోచనకు ముసలాడు ఉలిక్కిపడి పరిహాసంగా అంటోందనుకుని "స్వర్గంలో నందనవనం వుంది. పారిజాతం వుంది. ఇంద్రుడు, దేవతలు, అప్సరసలు అందరూ వున్నారు. పైగా యముడు కూడ అక్కడే వుంటూవుంటాడు. అయినా... మీరు వెడితే నందనవన విహారానికి, మేము వెడితే, యమధర్మరాజును కల్సుకుందుకు..." అంటూ నవ్వాడు. నిరుపమకేసి చూస్తున్న యామినీబాబువైపు చూసి, "అయితే ఆమెను నువ్వే అడగవయ్యా ఆ ఋణం సంగతి. ఆమె యేంచెప్తుందో అదే చెయ్యి" అన్నాడు.

డబ్బు విషయంలో యామినీబాబు చాల దూరదర్శి. ఈ ఋణం విషయంలో నవ్వుతూ పరిహాసాలతోనే నిరుపమ నెత్తిమీద చెయ్యి పెట్టాలని యోగేష్ బాబు ఆలోచిస్తున్నాడని యామినీబాబు గ్రహించాడు. కాని ఆమెను రక్షిద్దామంటే పుట్ట మొదటికే మోసంవస్తుంది. నిరుపమ ఆస్తి నలభై లక్షలకు మించివుంటుంది. వృద్ధుడు తల్చుకుంటే ఆమెకు యెక్కడైనా పెళ్లి చెయ్యగలడు. ఇవన్నీ ఆలోచించే తానీ సంబంధానికి అంగీకరించాడు. తనకుకూడ మరెక్కడైనా ఋణం దొరక్కపోదు. కాని ఆమె ఆస్తి! దానికోసమనే అతడు యిటు మొగ్గాడు. ఆలోచించి యోగేష్ బాబువైపు చూస్తూ "అడగడానికి నాకే అభ్యంతరములేదు" అన్నాడు నవ్వుతూ. యోగేష్ బాబు మాట్లాడకపోయేసరికి, నిరాశతో నిరుపమవంక చూచాడు. నిరుపమ దీర్ఘ నిట్టూర్పు విడిచి "నాకు అభ్యంతరం లేదు. మామయ్య యెలాచెప్తే అలాగే, ఆయన అభిప్రాయానికి విరుద్ధంగా యెప్పుడూ చేయను" అంది. ఆమె హృదయాన్ని యెవరో పిండినట్లుగా బాధపడింది. ఒక వ్యక్తికి యేదైనా అయిష్టమైన భావనవుంటే — అదే ప్రపంచానికి యిష్టమేమో! ఆమె ఆలోచిస్తూ కూర్చుంది. యోగేష్ బాబు ఆమెకేసి చూచి, పురోహితుని పిలిచాడు.

(సశేషము)




# విశాల ప్రపంచంలో..

శ్రీ సుబ్బారావు శాస్త్రి

బాపూజీ ఒకనాడు తన శిష్యులతో మాట్లాడుతున్నాడు. ఆరోజు వెన్నెలరాత్రి అవతంమూలాన్న చెట్ల క్రింద అంతా కూర్చున్నారు.

బాపూజీ, శిష్యులలో ఒకరు కొంచెం గర్వంగా మాటాడటం విన్నారు. అప్పుడాయన ''నాయనా! పైకి చూడు!... ఎన్ని నక్షత్రాలున్నాయో లెఖ్ఖ పెట్టగలవా....?'' అని అడిగారు శిష్యుణ్ని.

''బాపూ! అవి చాల వున్నాయి. ఎవ్వరూ లెక్కించలేరు!'' అన్నాడు శిష్యుడు.

''మరి, అందులో భూమికన్నా చాలా పెద్దవి వున్నాయని తెలుసా....?'' అని అడిగారు బాపూ.

''బాపూ? భూమికన్నా పెద్దవి కాదు; భూమికన్నా పెద్దది సూర్యగోళం, అంతకన్నా పెద్ద నక్షత్రాలు వున్నాయి!'' అన్నాడు శిష్యుడు.

''నాయనా! అటువంటి గోళాలలో మన భూమి ఎంత వుంటుంది?''

''మహా....వుంటే, ఓ చీమపాటి దుంటుంది!'' అంటూ జవాబిచ్చాడు శిష్యుడు.

''మరి, యీ భూమిలో మన ఆసియా ఖండం ఎంతపాటి. ?...ఆసియా ఖండములో మన భారతదేశం మరీ చిన్నదే కదా...! ఇప్పుడు చెప్పు—భారతదేశంలో మనజిల్లా ఎంత వుంటుంది? దాన్లో మన వూరు యెంత? మనవూళ్లో యీ చిన్న యిల్లు ఎంత వుందో చూసుకో...!' — బాపూజీ చిరునవ్వు నవ్వారు.

''చీమలో ఎన్నోవంతో యీ ఇల్లు-!''

''ఆ యింట్లో మనం...''

'చాలా చిన్నవాళ్ళం...!'' అన్నాడు సిగ్గుతో తల వంచుకుంటూ.

''నాయనా! నేను అల్పుణ్ని. నలుసులో నలుసుకన్నా చిన్నవాణ్ని. అని వూరకే కూర్చుంటామా! — కూడదు — గర్వం మాత్రం తగదు మనం యింత చిన్నవాళ్లమయినా విశ్వమంతట్నీ చూడగలం...! అల్పత్వం, ఘనత రెండూ ఊహించుకోగల జ్ఞానం భగవంతుడు యిచ్చాడు మనకి.

కేవలం ఘనత తెలుసుకొని గర్వ

పడుతూ ఎంత గొప్పపని చేసినా, ఇతరు మనం మెప్పుడూ గర్వపడగూడదు." లని బాధించినవాడై చెడిపోతాడు!... అంటూ బాపూజీ బోధించారు.

---

# "తెలివితక్కువ ఆకలెక్కువ"

శ్రీ ఏ. ఏ. ఎన్. రాజు

ఒకప్పుడు బాగ్దాద్ నగరంలో మస్తాన్ అనే మంగలి నివసిస్తూ వుండేవాడు. మస్తాన్ క్షౌరం చేయడంలో గొప్ప పేరుపొందాడు. ప్రతివారూ మస్తాన్ పనితనానికి యెంతో మెచ్చుకునేవారు. ప్రతివ్యక్తి క్షౌరం చేయించుకోటానికి మస్తాన్‌నే పిలిచేవాడు. మస్తాన్‌కి క్రమంగా గర్వం హెచ్చింది. తనను మించినవాడు యీ ప్రపంచంలో లేడుకదా అని అతని భావం. మస్తాన్ పేరు నలుమూలల మారుమ్రోగింది.

ఒకనాడు నగరపు నవాబ్‌గారు క్షౌరం చేయించుకోనటానికని మస్తాన్‌ పిలిపించారు. నవాబ్‌గారే తన్ను పిలుస్తున్నారుగదా అని యెంతో మురిసిపోయాడు మస్తాను. నవాబ్‌గారికి తన నైపుణ్యాన్నిఅంతటి వినియోగించి యెంతో అందంగా క్షౌరం చేశాడు. నవాబ్‌గారు మస్తాన్ పనితనానికి యెంతో విస్తుపోయారు. మస్తాన్ భుజాలు కొండంతలుగా పొంగిపోయాయి. నవాబ్‌గారు మస్తాన్‌కి పదిబస్తాల మేలురకం బియ్యం బహుమానంగా యిచ్చారు. (ఆ కాలంలో ఇప్పుడికిమల్లే నాణెములు వుండేవి కావు). మస్తాన్ రాజుగారి గుఱ్ఱపు బగ్గీమీదే పదిబస్తాల బియ్యం హాయిగా గృహానికి తెచ్చుకున్నాడు.

మస్తాన్ ఇంట్లో అడుగుపెట్టకముందే వంట చేయమని భార్యకు హుకుం జారీచేశాడు. ఒంటరిగా ఇంట్లో కూర్చొని పరివిధాల ఆలోచింప సాగాడు. నేనెంత గొప్పవాడ్ని కాకపోతే నవాబ్‌గారు పది బస్తాల బియ్యం బహుమానంగా యిస్తారు! మరి నవాబ్‌గారు బహుమానం యిచ్చినట్లు ప్రజలందరికి యెట్లా తెలుస్తుంది. ప్రజలందరికి తెలిస్తేగా నన్నింకా బాగ పొగుడుతారు. మరి వారికి తెలియజేయడం యెట్లా? ఏమిటి కర్తవ్యం? అనిబుర్ర గోక్కున్నాడు. కారుమేఘాలలో మెరుపు మెరసినట్లు నలుమూలల వికసిస్తుందో అట్లాగే మస్తాన్ మట్టిబుర్రలో ఒక ఆలోచన మెరసింది. తక్షణమే వంటిట్లోనికి పరుగెత్తాడు. మండుతున్న కొరకంచును తీసి యింటిచూరు ముట్టించాడు. మొదట చిన్నచిన్న పొగలు వ్యాపించాయి. క్రమంగా పొగలు పెద్దమంటలై అగ్ని జ్వాలలు నలుమూలల వ్యాపించాయి. అరే పాపం! మంగలి మస్తాన్ గృహం తగులబడిపోతుంది. రక్షించండి! రక్షించండి! అని కేకలు వేసుకుంటూ ప్రజలంతా మస్తాన్ యింటిముందు గుమిగూడారు. మస్తాన్ ఒక కంచంలో భార్య వండిన అన్నం పట్టుకొని దర్జాగా నడివీధిలోనికి వచ్చాడు. ఒరేయ్ మస్తాన్! నీయిల్లు తగులబడిపోతుంటే, యేరా దర్జాగా వస్తున్నావ్. నీకు మతీ, సుతీ లేదేంటి అని ప్రజలంతా ఒక్కసారి ప్రశ్నలవర్షం కురిపించారు.

చెడుగాలం దాపరించినవానికి పెద్దల మాటలు చెవిని చొరబడతాయా! మస్తాన్ వాళ్ల మాటలను లెక్క చేయకుండా ఇట్లు అన్నాడు. అరే! భగవాన్ మీకి సంగతి యింకా తెలియదు కాబోలు. గొప్పవారైన నవాబ్‌గారు నా పనితనానికి బహుమానంగా పది బస్తాల బియ్యం ఇచ్చారు. వాటిని వండుకొని తింటున్నా. ఇదిగో కావలిస్తే చూడండి! నా మాటలు నిజమో, అబద్ధమో అని చేతిలోవున్న కంచం చూపెట్టాడు. అప్పటికీ మస్తాన్ మనస్సు తృప్తిపడలేదు కాబోలు. ఇంకా తన పనితనాన్ని గోరంతలు, కొండంతలుచేసి చెప్పడం మొదలు పెట్టాడు. మాటల సందడిలో మస్తాన్‌కి ఇంటి సంగతి జ్ఞాపకం వచ్చింది. వెనక్కుదిరిగి చూస్తే యింకేముంది! పూర్తిగా కాలి బుగ్గి అయిపోయింది. అరే! భగవాన్ నా తెలివితక్కువ నన్నే చంపుకుతిందే అని కుప్పలా కూలిపోయాడు మంగలి మస్తాన్. మస్తాన్‌యొక్క తెలివితక్కువకు ఆకలెక్కువకు ప్రజలంతా కడుపులు చెక్కలయ్యేటట్లు నవ్వుకుంటూ వెళ్లిపోయారు.

---

# గట్టిబుర్ర

శ్రీ కుమారి పిల్లా విద్యారాణి

నాయుడు ఉత్త కోతలరాయుడు. ఇంత దాన్ని అంతచేసి చెప్పేరకం!...కానీ, అతను అంటే ఆ గ్రామంలో అందరికీ అభిమానం.

రోజూ నాయుడు యింటి అరుగుమీద సాయంకాలంపూట నలుగురూ కూర్చొని లోకాభిరామాయణం చెప్పుకుంటూ వుంటారు.

ఆవేళ వాళ్ల వూరికి ఎవరో మంత్రిగారు వచ్చారు. ఆయనా, ఈవూరి పంచాయితీబోర్డు ప్రెసిడెంటూ ఒకేబళ్లో చదువుకున్నారుట! ..అందుకని చూసిపోదామని వచ్చారుట? ...

ఆ మంత్రిగార్ని . మన నాయుడుగారు కలుసుకున్నారుట!...ఆయనగారు ఈయనగారతో భోజనం చేస్తూనే మాట్లాడేరుట!...భోజనంకూడా చెయ్యమని కోరేరుట!...

నాయుడు ఏదో . మహాసముద్రంలాగ చెప్పుకుపోతున్నాడు.

అంతవరకూ వింటూ కూర్చున్న 'నూకాలు' వెటకారంగా నవ్వి - 'నువ్వేనంటయ్యా...నాద్దూ...మంత్రిగోరితో మాట్లాడుత!...నేనూ మాట్లాడుత!... అంతేకాదు, ఆయన పక్కన కూకొని అన్నం భోంచేస్తా!...అన్నాడు మీసం దువ్వుతూ.

దాంతో నాయుడికి బలేకోపం వచ్చేసింది!...

'అబ్బోయబ్బ!...అంత మొనగాడివేం!...ఏదీ, ఇయ్యాళ వెళ్ళి...భోంచేసిరా...చూద్దాం!...' అన్నాడు నాయుడు.

'ఓ...' అన్నాడు నూకాలు.

'ఓ.. అంట!... ఓ!...నువ్వు కానీ... ఆయన పక్కన కూకొని భోంచేసి వస్తినా ...నేను వడ్లు బస్తా ఓటి యిచ్చేస్తా ..' అన్నాడు నాయుడు.

'అట్టాగే! ... కొత్తపంట వచ్చినాదిగా! . ఓడిపోతే... నేనూ యిస్తాన్లే!...' అన్నాడు నూకాలు.

'సరే...ఎల్లరా!' అన్నాడు నాయుడు.

'పందెం మర్చిపోమాక!....' అన్నాడు నూకాలు.

'మేం...ఉన్నాంగా! . ' అన్నారు మిగతా పెద్దలు.

నూకాలు మెల్లగా ప్రెసిడెంటుగారింటికి వెళ్ళాడు. అది రాత్రి భోజనాల సమయం.

'ఏరా...యిలా వచ్చావు?....' అని అడిగారు ప్రెసిడెంటుగారు, నూకాలుని.

'చిన్న పనిబడ్డది బాబూ!...' అన్నాడు నూకాలు.

'ఏంవిట్రా?' అని అడిగారు భోజనానికి వెళ్తున్న ప్రెసిడెంటుగారు.

'బాబయ్యా! .. ముంత చెంబెడు బంగారం ముద్ద ఖరీదు ఎంతుంటది బాబయ్యా?' అని అడిగాడు నూకాలు.

ప్రెసిడెంటుగారు ఆశ్చర్యంగా, పక్కనే వున్న మంత్రిగారివైపు చూశారు.

(282వ - పేజీ చూడుడు)

# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)



ధర్మపత్ని యాడిన వాక్యము బల్లెపుఁ బోటు వలెఁ తులసీదాసు హృదయమును జీల్చివైచెను. వెంటనే అతఁ డొక్కక్షణమయిన నట నిలువక ప్రయాగకు వెడల ఐహికములగు విషయవాసనలు దిగనాడి — సంగవర్జితుఁడుగ మెలఁగసాగెను. అతఁడు భరతఖండములోని — జగన్నాథము, రామేశ్వరము, ద్వారక, బదరికాశ్రమము మున్నగు పుణ్యక్షేత్రములను దర్శించుచుఁ బదునాలుగేండ్లు గడపెను. అట్టి పుణ్య తీర్థయాత్రలవలన అతఁడు తన ప్రశాంత స్వభావమును, కష్టసహనశక్తిని పెంపొందించుకొనెను. అతఁడు నరహర్దాసువలన ఉపదేశమందెను.

తులసీదాసు, భగవత్స్వరూపమును — నిరూపించి, స్మృతియందు నిలిపికొని, ప్రత్యక్షీకరించుకొను నంతటి యున్నతస్థితికి వచ్చెనని యీక్రింది విషయము వలన స్పష్టమగుచున్నది:—

ప్రతిదిన మాతఁడు కాల్యకృత్యములు దీర్చికొన గంగకావలియొడ్డున కేఁగెడివాఁడు. మరలి వచ్చునపు డాతఁడు తన కమండలములో మిగిలియున్న జలమును మార్గమధ్యమున నున్న పిశాచావాసమగు తరుమూలమున గ్రుమ్మరించెడివాఁడు. ప్రతిదిన మటు తన్ను సేవించు తులసీదాసుని యుపకృతి కెంతయు సంతసించి యాపిశాచము ఒకనాఁ డాతనియెదుటఁ బ్రత్యక్షమయి, యేదే నొకవరము ఇచ్చెదననెను. అపుడు తులసీదాసు:—'నాకు శ్రీరామదర్శన మగునట్లనుగ్రహింపుము. అంతకు మించిన పరమేది గలదు?' — అని యనెను. అప్పుడా భూతము, "ఇదిగో, ఇక్కడికి సమీపమునఁ గానఁబడు దేవాలయమున అనుదినము చీఁకటిపడిన తరువాత, ఒక మహనీయుఁడు రామాయణ పురాణ కాలక్షేప మొనర్చును. అక్కడికిఁ దప్పక హనుమంతుఁడు దినదినము అరుదెంచును. అతఁడు మాలువేసమునఁ గుష్ఠవ్యాధిపీడితునట్లు అగపడును. అతఁడయ్యెడకు శ్రోతలందఱి కంటె ముందుగనే వచ్చి, యెల్లరు వెడలిన వెనుక ఆ చోటినుండి కదలును. నీవాతని నాశ్రయించుచో నీకోరిక నిస్సంశయముగ ఈడేఱఁగలదు? అని యానతిచ్చెను. పిశాచముల ఱేఁడు వచించినరీతిఁ దులసీదాసాగుడికిఁ బోయి, హనుమంతులగని, యాతని చరణ సరసిజములపై సాష్టాంగపడెను. ఆవనచరపుంగవుఁ డాతని చిత్తశుద్ధికిఁ బరమభ[illegible] మెచ్చి తద్వాంఛాసిద్ధికిఁ జిత్రకూటమున కరుగ నాజ్ఞాపించెను. వెంటనే, ఆమహాభక్తుఁడు బయలుదేఱి చిత్రకూటముం జేరి శ్రీరామ ప్రభు నన్వేషించుచుఁ దిరుగసాగెను. అంత నొకనాఁ డొక జింకను దఱుముకొనుచు నొకనీలమేఘశ్యామాంగుఁడును, ఒండొక పసిమి మిసమిసలఁగు పదాఱు వన్నె పసిఁడి మెయిఁగలవాఁడును — అగు నిరువు రశ్వారూఢులైన యువకులతని కగపడిరి. వారి లోకోత్తర సౌందర్యమున కత్యంతము ముగ్ధుఁడై నిశ్చేష్టుఁడై, కింకర్తవ్యతామూఢుఁడై — తులసీదాసు వారు చనినదిక్కునకే నిరిమేష నయనము లప్పగించి చూచుచు నిల్చుండెను. ఆతరుణవయస్కులు చూపుమేర దాఁటిపోవఁగనే, పావని తులసీదాసునెదుటఁ బ్రత్యక్షమయి "నీవేమైన నిటఁగనుఁగొనఁ గలిగితివా?"— అని అడిగెను. గోస్వామి — "దేవా! అనిలతనయా! ఏమని చెప్పఁగలను. అసాధారణ దివ్యమనోహర మూర్తు లిరువురు యువకులు ఉత్తమహయారూఢులై వెడలిరి. వారవర్ణనీయ తనూరుచులు దలపోయుచు నిట నిశ్చలుఁడనై నిలిచితి". అనుటయు, మారుతి; — "వారే రామలక్ష్మణులని గ్రహింపుము" అనెను.

సంవత్సరమున వచ్చు అమావాస్యలలో ఒకటి 'మౌనిఅమావాస్య' - అని ప్రసిద్ధి వహించినది. అట్టిది 1607 సం॥ న ఒక బుధవారమునాడు తటస్థించినది. [illegible]దినము తులసీదాసు చిత్రకూటమునఁ జందనము తీయుచుండెను. అట్టియెడ నున్నట్టుండి భగవంతుఁడతని యెదుట సాక్షాత్కరించి. కొంచెము గంధ మిమ్మని అడిగెను. తులసీదాసు అపుడాతనిఁ దన తలయెత్తి చూచెను, అతని మనస్సును ఆదివ్య

సుందరవిగ్రహుఁడు సారించుటచే, ఆయన వెడలిన వంకకే చూచుచుఁ దన్మయుఁడై నిలుచుండియుండెను. తులసీదా సట్టియదనునఁ దన మనః ప్రవృత్తినే కాక, శరీరమును బయట ప్రపంచమును గూడ మఱచెను.

1631 సం॥న అతఁడు శ్రీరామనవమి మంగళవారమున హనుమంతుని ప్రోత్సాహముచే, అతఁడు నుడివిన మార్గము ననుసరించి, 'రామచరితమానసు' కావ్యరచనమునకుఁ దొడంగెను. ఆగ్రంథము నాతఁడు పూర్తిచేయుటకు రెండు సం॥ములు, ఏడు నెలలు, ఇరువదియారు దినములు పట్టెను. గ్రంథరచన మారీతి ముగియగనే, హనుమంతుఁడు ప్రత్యక్షమై మొదటినుండి తుదివఱకు తులసీదాసు పఠింపఁగా వినెను. హనుమానుఁడు ఆత్మ సుప్వాంగి తులసీదాసుం గాంచిన, ఓయీ నీ యీయమూల్యకావ్యము ప్రపంచమున చిరస్థాయిగ వెలసి, నీకుఁ జేరుప్రతిష్ఠలను సమార్జింపఁ గలదని దీవించెను.

ఒకనాఁ డర్ధరాత్రమునఁ దులసీదాసు నాశ్రమమును బందిపోటుల తండ మొండు ప్రవేశింపఁ బ్రయత్నించెఁగాని, ద్వారముకడ నల్లని శరీరచ్ఛాయఁగల మహావీరుఁడును నాజానుబాహుఁడుఁను, దివ్యసుందరవిగ్రహుఁడు నగు పురుషుఁడొకఁడు, ధనుర్బాణములను జేతఁ దాల్చి, నిలిచి కావలి కాయుచుండెను. అది కని యాతెక్కలి కాండ్ర గుంపు ఊడనిబాడెను. మరల మఱునాఁడుఁగూడ ఆచోరులట్లే ఆటకురాఁగా, మునుపటివలెనే ఆ మహాపురుషుఁడు వాకిట నిలిచియుండెను. మూఁడవ దిన ముదయమున నాతస్కరసమూహము అట కరుదెంచి 'స్వామీ! ఈలఁదమయాశ్రమ రక్షణ మొనర్చుచున్న యా మహావీరుఁడెవఁడు?' అని సప్రత్యయ వినీతమతిఁ బ్రశ్నించిరి. తన ప్రభువగు శ్రీరామచంద్రుఁడే భక్తుఁడగు తన్ను ఆదొంగలబారిఁ బడకుండ రక్షించుటకయి యట్టి మహత్తరమగు శ్రమకుఁ బాల్పడెనని గ్రహించి, వెంటనే తులసీదాసు తన స్వాధీనమున నున్న విలువగల వస్తు సముదాయము నెల్ల బీదలకందఱకుఁ బంచియిచ్చెను.

ఒకప్పుడొక్క వితంతువు తన పెనిమిటి మృతికయి చింతించుచుండఁ దులసీదాసు ఆమె దుస్థితికి వగచి, తన యాశీర్వచన బలముచే, ఆచనిపోయిన గృహస్థునిఁ బునర్జీవితు నొనర్చెను. దీనింగూర్చి పలు విధములుగ వదంతులు దేశమున వ్యాపించెను. తుదకది ఢిల్లీలోని మొగలు సార్వభౌముని వీనులం గూడం బడెను. వెంటనే యతఁడు తులసీదాసును దన సంస్థానమునకుఁ బిలిపించి, చచ్చినవారిం బ్రతికించు క్రియకుఁ గారణము నిరూపింపుమని యాదేశించెను. పరమసాధువును వినమ్రుఁడు నగు తులసీదాసు ఆతనిం గని, తన యాత్మాధిష్ఠాంత యగు శ్రీరామచంద్రుని దివ్యనామము తప్ప మఱెట్టి దైవిక మహాశక్తియుఁ దానెఱుఁగనని వచించెను. అతని మాటఁ దనకసంతృప్తి ఘటించుటచేఁ జక్రవర్తి యాతనిఁ గాంచి, 'ఈయద్భుత చర్యారహస్యము నీవు కార్యరూపమున మాకుఁ బ్రత్యక్షము సేయకేని నీకీ చెఱనుండి విముక్తి లభింప' దనియెను. అపుడు గోస్వామి వాయుపుత్రునిఁ బలువిధములఁ బ్రస్తుతించి, తనకు బంధవిముక్తిం బ్రసాదింపఁ బ్రార్థించెను. అంత ఆ రాజాస్థానమంతట నసంఖ్యాక వానర సమూహములు తండోపతండములుగ వచ్చి మహాభీభత్సముగఁ బాడుచేసి, యచటి ప్రభు పరిజనులను భయభ్రాంతుల నొనర్చెను. వెంటనే ఆ మొఘల్ పరిపాలకుఁడు గోస్వామి తులసీదాసును కారాగారమునుండి విడిచిపెట్టుట కానతిచ్చెను. అప్పుడతఁడు అట్లు చెఱనుండి వెలువడిన తులసీదాసునకు నంజలి ఘటించి, తన యవివేకమునకుఁ బశ్చాత్తాపమందుచు – తన దోషమును క్షమింపఁ బ్రార్థించెను.

ఒకప్పుడు గోస్వామి తులసీదాసు తీర్థయాత్రలు చేయు సందర్భమున బృందావనమునకు వెడలవలసి వచ్చెను. అక్కడి దేవాలయమునకు భగవద్దర్శనార్థము వెడలఁగా, నట శ్రీకృష్ణ విగ్రహమాతనికిఁ గనఁబడెను. తత్క్షణమతీ ద్వాక్కునుండి వెల్వడిన పద్యమిది:–

"దీటులేనట్టి నేఁటి నీదివ్యమూర్తి
యంద మెట్టులు వర్ణింపనగును నాకు
శరశరాసనములు నీవు కరమునఁ గొని
నపుడె తలవ్రాల్చుఁ దులసి, మహా
ప్రభుండ.॥"

భగవంతుఁ డపుడు తులసీదాసు నెదుట శ్రీరామచంద్రుని రూపమ్మునఁ బ్రత్యక్షమయ్యెను.

గోస్వామి తులసీదాసు భగవద్భక్తి చిప్పిలు పండ్రెండు కృతులు రచించెను.

అందు అత్యంత శాశ్వతమగు అతని రామాయణ

కావ్యము ఉత్తర, హిందూస్థానమందలి ప్రతి హైందవుని యింట మిక్కుల భక్తితోఁ బారాయణ మొనర్పబడును, అనవరత పూజాపురస్కృతులొనర్పబడును. ఎందఱు నాస్తికుల నది యాస్తికులం జేసెనో లెక్కించుట కలవిగాదు. మఱెందఱు జ్ఞానుల కది నిశ్చయపరమార్థ విజ్ఞాన ప్రకాశము గలిగించెనో, గణుతింప శక్యము గాదు. ఇంకెందఱను బరమ భక్తాగ్రగణ్యులఁ గావించి భగవంతుని సాక్షాత్కారము లభింపఁజేసెనో నుడువ సాధ్యము గాదు. మహోత్తమమగు ఊర్ధ్వలోక ద్వార కవాటమెల్ల భక్తులకు దెఱచియుంచుట తులసీదాస రామాయణము తాళపుఁజెవి వంటిది. ఈ పవిత్రగ్రంథ మెఱుఁగని హైందవుఁడీ భారత సీమలోనే లేఁడన్న నందతిశయోక్తి యించుకయు లేదు.

1680 సం॥ న శ్రావణ శుద్ధసప్తమీ శనివారము నాడు, తన 126వ యేట వారణాసి యందలి అసీ ఘట్టమున గోస్వామి తులసీదాసు తన భౌతిక శరీరమును త్యజించి శ్రీరామచంద్రుని పదసన్నిధానముం బ్రాపించెను.

భారతదేశము మహాయోగుల కునికి పట్టగు పవిత్ర సీమ. అట్టివారు స్త్రీ పుంవిభాగములకు సంబంధించిన భేదము వినుమంతయు లేని పరమపుణ్యమూర్తులై, యైహిక లాంపట్యములతోఁ గొట్టుమిట్టాడు మానవ సంఘములోని జాతికులాచారకర్మల కతీతులు. అట్టి వారిలో నద్భుత చారిత్రయగు రాజపుత్రస్థాన రాజతనూజ యొండాదర్శప్రాయయగు యోగినీమణిగ — ఆ నాఁడు వన్నెకెక్కెను. అట్టి యనురాగవతి — ఆత్మానురాము-ఆకర్షణీయశీలసంపన్న అత్యంతోన్నత వైభవోపేత - అనన్యస్వభావ - అమితశుచిరూప - నరలోకమునఁ గానఁబడిన యాశతాబ్ద మొక బంగారు యుగము శ్రీకృష్ణప్రియయగు గోపికయే యొకర్తుక, మరల మర్త్యలోకమున నిట్లవతరించి, తనసర్వస్వము భగవంతున కర్పించి ఆయన యతిలోక లావణ్యము చేతను, స్మరణము చేతను బరవశత్వమునంది యాయన యందేలయించుట — ఎట్లో లోకమునకుఁ బ్రత్యక్షముగఁ జూపునట్లొ ప్రవర్తించెను.

యుగముల తరబడి ముముక్షువులు రెండు విధములగు సాధన మార్గములనవలంబించుచున్నారు. అందొకటి అంతరాత్మను జ్ఞానభక్తియోగముల వంకకు మరల్చి [illegible] సిద్ధిని బొందుట. రెండవది ఆ రెంటిని ఆత్మయొక్క [illegible] జేసికొని, [illegible]

పూర్ణతను సాధించుట:- ఒకపక్షమువారు, ఆత్మయొక్కటియే సత్యమనియు, శాశ్వతమనియు వచింతురు. వేఱొండు తెగవారు, ఆత్మయే సర్వోన్నత పదార్థమయినను, అది ఐహిక సంబంధియగుట — ప్రపంచము గూడ సత్యమనియు శాశ్వతమనియు వాకొందురు. ఆత్మయు విశ్వమును భగవద్భాగములే. ఆత్మ తనకనుగుణముకాని దానినెల్ల నిరాకరించును. తన్ననుసరించు పదార్థము ఎట్టిదైనను సిద్ధినందిన ఆత్మ - పరతత్త్వ జ్ఞానము చేతను, భక్తియోగము చేతను దన్ననుసరించుటకు ఉన్ముఖత్వము జూపును. విజ్ఞాని స్వప్రయత్నముల చేఁ బరబ్రహ్మము నందుకొనుచో, భక్తుడు తన్నా పరబ్రహ్మమునకుఁ బరిపూర్తిగ నర్పించుకొనుటచేఁ దన వంక కాకర్షించుకొనును. సారాంశమేమన;- జ్ఞానయోగి యజ్ఞాన మేఘావరణమును జీల్చికొని, పైకిఁ బోయి తత్త్వజ్ఞాన నును నిశ్చల సూర్యకాంతి సహాయమున భగవంతునిజేరును. భక్తియోగ సాధకుఁడు కుటీరద్వారమునఁ గనిపెట్టికొని, చూచుచుండి, జీమూతములు తొలఁగిపోవఁగనే గంభీర తేజోమండల మధ్యస్థమగు భగవన్మూర్తిని దర్శించును.

## మీరా మస్తాని

ఈ జ్ఞానభక్తియోగ బీజములు రెండు నుపనిషత్తులందఱచి చూచువారికి లభించును. జ్ఞానమార్గము తీర్థంకరులు, బుద్ధుఁడు, గౌడపాదుఁడుఁ శంకరుఁడు తన్మతానుయాయులు అనుగమించిరి. భక్తిమార్గమును, రామానుజుడు చైతన్యుడు, తులసీదాసు, మీరాబాయి మున్నగువారనుసరించిరి. ఈ రెంటిని ఆయా కాల దేశ వర్తమానముల ననుసరించి నానకు, కబీరు, రామకృష్ణపరమహంస - ఇట్టివారంగీకరించిరి. మీరాబాయి యన్ననో, సంపూర్ణ భక్తియోగ ప్రపత్తికే అంకితమయిన నారీశిరోమణి. పవిత్రతారాధ్యవర్తాత్మాభినివేశ హృదయమును ఆమె నిష్పష్టమొనర్చిన దేవ్యంశా సముదిత మానవస్వరూపిణి.

ఆ మహాత్మురాలు శా॥ శ॥ 1555 1560 సం॥ర ములకు మధ్య జన్మించెను. ఆమె రతన్‌సింగు రథోరుని యేకైకపుత్రిక. జోధపూరును నిర్మించిన రావు జోధజీకి మునిమనుమరాలు. పసితనముననే యామె మాతృవిహీనురాలై, తన పితామహుఁడగు రావు దూదాజీ సంరక్షణమున నుండెను. ఆనాఁటి శ్రీకృష్ణభగవానుని [illegible] భక్తాగ్రగణ్యుఁడు.

(సశేషము)

# "ఏల?"

శ్రీ మరువాడ సూర్యప్రకాశం



శమము లేని — తపము
దీక్ష లేని ... జపము

సతి లేని ... సౌఖ్యము
మతి లేని ... మాటలు

పగ తీర్చ లేని ... బలిమి
అనుభవం లేని .. కలిమి

నిజము లేని ... పలుకు
కారణం లేని ... కులుకు

శృతి లేని ... సంగీతము
జత లేని ... నెయ్యము

నీరు లేని ... బావి
పాత్ర మెరుగని .. ఈవి

స్థిరము లేని ... మనసు
కీర్తి లేని ... వయసు

తెలివి లేని .... చదువు
తేట లేని ... నీరు

భక్తి లేని .... పూజలు
శక్తి లేని ... పరుగులు

పతి మెచ్చని ... భటుని సేవ
నదిలో తెడ్డు లేని .. నావ

అర్థపొందిక లేని ... కవిత్వము
శ్రద్ధ ఉత్సాహం లేని నాయకత్వము

సిరి లేని వారికి .... సంతానం
వరి పండని మడిలో .. విత్తనం

వయసు లేని వృద్ధుకు ... వివాహం
ఆకలి లేని అతిధికి ... అల్పాహారం

కొప్పు లేని పట్టతలకు ··· కురు తైలం
తప్పు లేని కులకాంతకు ··· దండన

నీతి లేని వారికి ··· నియమం
చేతకాని వారికి ··· శౌర్యం

పిలుపు లేని పెండ్లికి ···· పేరంటం
వలపు లేని వధువుతో – వీరాంగం

ఎండ కాయని ··· ఛత్రము
ఆపద సమయంలో .. దోడు రాని మిత్రులు

ప్రేమ జూపని ... పింతల్లులు
ఆదరము లేని ... ఇల్లరికం

# నేను చేసింది తప్పా?

'సుశీ - సిపు'



ఆ రోజు రాత్రి ఓడియన్ థియేటరులో సినిమాచూచి రాత్రి 12గం॥లకు యింటికి బయలు దేరాను. మా యిల్లుచాలాదూరం. బస్సులు లేవు - టాక్సీలో పోవడానికి జేబులో చాలినంత డబ్బు లేదు. నడచివెళ్లడంకంటె గత్యంతరము లేకపోయింది. పిండారపోసినట్లున్న వెన్నెట్లో మరునాడు ఆదివారమగుటచే ఆఫీసు గొడవ లేదు కదాయని మెల్లగా నడక సాగించాను. మనుష్య సంచారం అంతగా లేదు. అడపా గడపా మోటారు కార్లు, ఆటోరిక్షాలు రివ్వునపోతున్నవి. సాధారణంగానే నా బుర్ర అనేక ఆలోచనలతో దిమ్మెక్కిపోతుంటుంది. ఇక ఒంటరిగా ఏ అడ్డంకులు లేని వాతావరణంలో ఏ దేదోయూహిస్తూ, ఆలోచిస్తూ ముందుకు సాగుతున్నాను. అక్కడక్కడ రోడ్ల కిరుప్రక్కలగల పేవ్ మెంట్లమీద పండుకొని నిశ్చింతగా నిద్ర పోతున్న బీదసాదలు నాలోసానుభూతిని, అనూయను రేకెత్తిస్తున్నారు. వాళ్ళలో అనేకులకు తినడానికి తిండి, ఉండటానికి యిల్లు, ఒంటినిండా గుడ్డ లేదని వారివాలకమే తెలుపుతున్నది. అయినా వాళ్లలో గల తృప్తి, చిత్తశుద్ధి, నిశ్చింత లక్షలు వేలు ఆస్థి, ఆదాయంకలవారికుండదని నా కనిపించింది. పైనుండి కురుస్తున్నమంచు వలన తల, గుడ్డలు చల్లబడ్డవి. కొంచం చలిచలిగానున్నది. నేను ఒంటరిగాడినైనా నా బుర్రలోని ఆలోచనా పరంపరలు, నా కూనిరాగాలు శ్రమ తెలియకుండా చిత్ర టాకీస్ దగ్గరకు చేర్చినవి. అప్పటికి షుమారు 1 గం॥ అయియుంటుంది. ఇంకాకొంచం ముందుకు పోయేసరికి ఒక పెద్దచెట్టునీడన ఎవరోవ్యక్తి కూర్చొని యున్నట్లు కనుపించింది. నాకు ఒళ్లు జల్లుమన్నది - కారణమేమిటంటే మా. యూరికి పొరుగూరికి మధ్యమార్గంలో యిలాంటి చెట్టుక్రిందనే ఒకదయ్యముండేదని, అది అర్ధరాత్రప్పుడు ఆదారిన ఒంటరిగా పోయెవాళ్లను, గుర్రపు బండ్లనుసయితం అటకాయించి నానా అవస్థలపాలు చేసేదని వినియున్నాను. తల నిండా ముసుగు-వెన్నెట్లో గుర్తించగలిగినంతవరకు స్త్రీయని పోల్చకలిగాను. సమీపానికి పోగానే ఆవ్యక్తి నావైపే నడువ సాగింది. నా ప్రక్కన ... ... నేను గమనవేగాన్ని తగ్గించి ఆ వ్యక్తిని పార జూచాను. ఒకయువతి - కళకాంతులుగల ముఖం; కాని శుష్కించిపోయి నీరసంగా కనుపించింది. నా వేషము, కట్టుచూచి తెలుగు వాణ్ణని అనుకొనియుంటుంది.

"బాబూ! పుణ్యముంటుంది - చాల ఆకలిగానున్నది. రెండు రోజులయింది అన్నంతిని - డబ్బేదైనా యివ్వండి" అన్నది తొట్రుపాటుతో. తలమీది ముసుగు జారిపోయింది. వెన్నెట్లో ఆమె సహజ స్వభావం బయటపడింది. వయస్సు 18,19

సంవత్సరములుంటవి. వేళకు తిండిలేక, పోషణలేక శుష్కించిన అవయవాలతో, జడలుకట్టిన వెంట్రుకలతో, దుమ్ముధూళి ఆవరించిన గుడ్డలతోనున్నా సహజంగా అందగత్తె అనిపించింది.

ఆమాటలు వినేసరికి ఏమి మాట్లాడాలో తెలియలేదు. జేబులోని సిగరెట్టు తీసి నిప్పుపుల్ల గీచి వెలగిస్తూ ఆమెముఖంవంక తేరపార జూచాను. ఆమె తలవంచుకున్నది,

"ఏమిటీ! డబ్బా - కానీ, అర్ధణాయిస్తే నీకాలేకడుపు చల్లారదు. ఇక రూపాయలు నీకు యీరకేనా ఎలాగదొరకుతాయ్? పోనీ నాతో ..." అన్నాను ఆయమ్మాయి ధోరణి పరీక్షచేయడానికని. ఒక క్షణం ఆగి నావైపు తలెత్తిచూచి మీరూ లోకంతోపాటేనా అన్నట్లు మరల తల వంచుకున్నది.

"ఈ వేళటప్పుడు ఆకలేమిటమ్మాయ్! ఈడొచ్చిన పిల్లవు - ఒంటరిగా తిరుగుతున్నావంటే ఆకలితీర్చుకోడానికాలేక. . నీలాంటి వాళ్లనుయీ మద్రాసు నగరంలో అనేక వేషాల్లో చూస్తునేయున్నాం. నిజం చెప్పు నీ సంగతేమిటో - లేకపోతేనిన్ను పోలీసులకు ఒప్పగిస్తాను" అన్నాను గట్టిగా.

"క్షమించండి! నిజానికి నేను వ్యభిచారిని కాను. కాని నా భగ్గున మండుతున్న కడుపుకు అన్నంపెట్టించి మీకోర్కెను తీర్చుకోవచ్చు. నాదీనావస్థను, ఆకలి మంటను అవకాశంగా తీసికొని నన్ను వినియోగించుకున్న వారు కొందరున్నారు కాని వాళ్లు కానిదిచ్చినట్టుంటా [illegible] అక్కరతీర్చుకోని పారిపోయారు. మరి మీరు దేవుడులాగ కనుపిస్తున్నారు - ఏమి చేసినామీదయ." అంటూంటే గొంతు బొంగురుపోయింది. నిజంగా ఆకలికి నకనక లాడిపోతున్నది. సమీపంలో ఏదైనా టీషాపు ఉన్నదేమోనని చుట్టూ కలయజూచాను. కాని కనుచూపు మేరలో ఏదీకనుపించలేదు,

"మీ యిల్లెక్కడ?"

"నాకిక్కడ యిల్లులేదు. మాది యీ యూరుకాదు"

"చాల ఆకలితోనున్నట్లున్నావు పాపం!"—అవునన్నట్లు ఏమీ మాట్లాడలేదు ఆమె.

"మరి యీ యూరు ఎందుకువచ్చినట్లు? ఈ ఒంటరిగా తిరుగడం ఏమిటి?"

"ఇది స్వయంకృతాపరాధం. నాతండ్రి వందయకరాల పొలంగల భూస్వామి. నన్నొక స్వార్థపరుడు సినిమా రంగంలో చేర్పి తారాపథానికెక్కిస్తానని ఆశపెట్టి యిక్కడికి పిలుచుకవచ్చాడు. మాఇంట్లో తెలియకుండ రు. 4000/-లతోటి, ఒంటిమీద 20 సవర్లనగలతోటి నేను అతనితో యిక్కడికివచ్చాను కొంతకాలం ఆడబ్బుతోటి మద్రాసునంతా వెంటేసుకొనితిప్పి, సినిమాలని, స్టూడియోలని, వినోదాలని, విలాసాలని నాలుగువేలరూపాయలు కరుగదీశాడు. తర్వాత క్రమంగా నాపట్ల నిర్లక్ష్యం, నిరాదరణ అతనికి ఏర్పడి నన్ను ఒంటరిగా వదిలేశాడు. అతడు ఎక్కడున్నాడో నాకు అచూకి చిక్కలేదు. మా అమ్మా, నాన్న నాకొరకని కొంత

వెదకించి చివరకు విసిగియూరుకున్నారు. నాకేంచేయాలో తోచలేదు. తిరిగియింటికి ఏ మొగంతో పోగలనాయని అనిపించింది. దగ్గరనున్న నగలను అమ్ముకొని జీ యాత్ర సాగించాను. తర్వాతకూడ కొందరు నన్ను పెండ్లిచేసికుంటామని, మరికొందరు సినిమాలలో చేరుస్తామని నా చుట్టూతిరిగి నన్ను వినియోగించుకొన్న పెద్ద మనుష్యులున్నారు చివరకు నా దగ్గర డబ్బుదుగ్గాణి అయిపోగానే చాలమంది మరుగు పడిపోయారు. అప్పటినుండి వారిదృష్టిలో ఎంగిలాకుగా కనుపించసాగాను. నాచుట్టూ చీకటి దట్టంగా అలముకుంది, ముందు వెనుకలు ఆలోచించకుండా చెప్పుకుమాటలు విని మోసపోయిన ఫలితంగా ఏర్పడిన పతనావస్థ నన్ను భయకంపితను చేసినది. ఇక నలుగురిలో ఉండలేక యిలా సందుల్లో గొందుల్లో అలమటిస్తున్నాను'' అన్నది లేని ఓపికతో సుదీర్ఘంగా.

''ఈ పరిస్థితులలో నాతోవస్తావా''

''అంతకంటె ఏంకావాలి ?''

నేను ముందు నడుస్తుంటే ఆమె వెనకాల కాళ్లీడ్చుకుంటూ అనుసరిస్తున్నది, సిగరెట్టు తగులబడి పోతున్నది. ఆమెను 'నా వెంట ఎందుకు రమ్మన్నానా' అనుకోసాగాను.

''నీ పేరేమిటి ?''

''సుగుణ''

''మీదేవూరు ?''

''కారంచేడు''

''మీ యూరికి రైలెక్కించి పంపిస్తాను; వెళ్తావా!''

''ఈస్థితిలో నేను తిరిగి యూరికిపోతే తలెత్తుకొని తిరుగగలనాయనేదే నాబాధ''

ఇంతలో ఒకటీ షాపును సమీపించాము. అదీ మూత పడడానికి సిద్ధంగా నున్నది. మేమిద్దరం లోపలికి పోయి ఆమెను కడుపునిండా టిఫెను, టీ యిప్పించాను. నాకు మాత్రం యిలా ఎంతమంది ఆడపిల్లలు ముందు వెనుకలు ఆలోచన లేకుండా అపోహలకు గురియై పతనంచెందుతున్నారోకదాయని తోచింది. ఇట్టి వారు భిక్షుకులుగా, వ్యభిచారిణులుగా, దేశద్రిమ్మరులుగా కొల్లలై పట్టణాలలో నున్నారుకాబోలని యూహించాడు. ఈ పిల్లకేదైనా మంచి మార్గం చూపించాలనే నిర్ణయానికి వచ్చాను. ఆమె నా వెంట నడుస్తూ వచ్చింది. మా యిల్లుచేరాం. ఆ రాత్రి మాయింట్లో తలదాచుకుంది. మరునాడుదయం మా అమ్మ 'ఈ పిల్లఎవరురా' అంటూ సణుగుడు మొదలుపెట్టింది. నేనామెను ముక్తసరిగా స్నేహితుని చెల్లెలని చెప్పి, స్నానంచేసి కాఫీ త్రాగిన తరువాత రెడీమేడ్ షాపులో గుడ్డలు తెప్పించి యిచ్చి నాతో బయలుదేరి రమ్మనాను. దారిలో మరల ''అమ్మాయ్! యిప్పుడైనా నీవు మీ యూరికి తిరిగి పోతానంటే పంపిస్తాను. మరి నీ సంగతేదో చెప్పు'' అన్నాను కటువుగా.

''భగవంతుని లాగ మీరు నన్నాదరించారు. ఏమిచేసినా మీదయ! తిరిగి యింటికి మాత్రం పోలేను''అన్నది ఆ పిల్ల బిక్క ముఖంతో.

బస్సు ఎక్కి మైలాపూరులోని స్త్రీ సేవా మందిరానికి మేమిద్దరం వెళ్లాం. అక్కడ

పాలక వర్గంవారికి ఆమెను ఒప్పజెప్పి విద్యాశిక్షణలకు ఏర్పాటుచేశాను. నేనే ఆమెకు గార్డియన్ గానమోదయ్యాను. నే నప్పుడప్పుడు చూచివస్తూ యోగక్షేమా లను విచారించేవాడిని.

నాల్గుగు సంవత్సరాలు దొర్లిపోయినవి. ఆ యమ్మాయి చదువుకొని ఏటేటా పాసగుతూ వచ్చింది. మంచి తెలివితేటలు చురుకుదనము, నలుగురితో కలసిమెలసి యుండటం చూచి పాలకవర్గం, తోడి వారు ఆమెను ఎంతో అభిమానంగాచూచే వారు.

ఒక రోజున మాఅమ్మమాటలసందర్భ మున నా పెండ్లిప్రస్తావనచేసింది. నేను దులబరించుకొని వెళ్లిపోయాను. ప్రతి రోజు యూళ్లోను, చుట్టుప్రక్కల అవు తున్న పెళ్ళిళ్ళను గురించి, కట్నకానుక లనుగురించి, వధూవరుల యీడు జోడు లనుగురించి అవకాశం చిక్కినప్పుడల్లా ఏ కరువుపెడ్తూ ''ఏమిరా! నేనుబ్రతికియుం డంగా నీ పెండ్లిచూసి చస్తానోలేదో'' అంటుండేది. అప్పటివరకు నరమానవుడితో చెప్పలేదు. కాని ఆనాడు మా అమ్మతో ''సుగుణను వివాహమాడతా''నన్నాను.

ఆ మాటకు ఆమె త్రుళ్ళిపడింది. ''అదే మిటిరా! దిక్కుమొక్కు లేని పిల్లను పెళ్లి చేసికోడమేమిటి!! కులమా గోత్ర మా'' అన్నది ముక్కుమీద వ్రేలేసుకొని.

''ఏది ఏమయినా సరే ఆమెనే చేసికో దలచాను'' అన్నాను పెంకిగా. ఆమె యికతను మాట్లాడిలాభం లేదనుకొని యూరకున్నది నా మూర్ఖపు పట్టుదల తెలిసినది కాబట్టి.

సుగుణకు నాకు వివాహమయింది. బంధువులకంటె మిత్రులు అనేకమంది నన్ను అభినందించి ఆశీర్వదించారు. పెండ్లికి బంధువులు చాలమంది కులము, గోత్రము కాని దాన్ని, దిక్కు మొక్కు లేని అనాధను పెండ్లిచేసికున్నానని రాలేదు. అనేకమంది యీసడించుకున్నారు. కొందరు చీవాట్లుపెట్టారుకూడా తర్వాత. అయినా ఆత్మ సమ్మతంగా ఒక పతనావస్థలోని యువతిని ఉద్ధరించాను కదా యని సగర్వంతో బంధువర్గాన్నంతా తృణ ప్రాయంగా చూచాను. ఈ సందర్భమున నేను చేసిన తప్పేమిటో చెప్పమని బహిరం గంగా నొక్కియడిగాను దానికి జవాబు?

—o—

# కృతజ్ఞత

అనేకమంది పాఠకులు నా సీరియల్ ''సాహసవీరులు''ను ప్రశంశిస్తూ లేఖలు వ్రాస్తున్నట్లు సంపాదకులు నాకు తెలిపినారు. పాఠకుల ఆదరాభిమానములకు ఎంతో కృతజ్ఞుడను. ఇకముందుకూడా క్రొంగొత్త పంధాలో వినోదం, విజ్ఞానం కలిగించే రచనలు వ్రాయగలనని వక్కాణించుచున్నాను. నా సీరియల్ ను తమ పత్రికద్వారా ప్రచురించిన సంపాదకమహాశయులకు ఎంతో కృతజ్ఞుడను.

భవద్విధేయుడు,
కానాధిభట్ల వెంకటసుబ్బారావు.

# మఠ గుహ

శ్రీ సి. సి. పున్నయ్య

(సర్వహక్కులు రచయితవి)

[పూరిల్లు. రాజయ్య, భార్య గంగులు విచారవదనాలతో నుంటారు. నాలుగేళ్ల కుమార్తె నాగమణి మిక్కుటమైన జ్వరముతో ఉక్కిరిబిక్కిరి యగుతుంటే, తల్లి పక్కలో కూర్చొని యుంటుంది. రాజయ్య ఏమి చేయడానికి పాలుబోక నిలబడియుంటాడు.]

గంగులు:_రాత్రంతా పిల్ల జ్వరంతో తపనపడింది కదా నీవిలాగ యూరకుంటే ఎట్లా!

రాజయ్య:_గంగులూ! అన్నీ తెలిసిన నీవే యిట్లా మాట్లాడితే నేనేమి చెయ్యాలి?

గం:_బాగుంది! ముందు పిల్లను తీసికొని వెళ్లి డాక్టరుకు చూపించి మందిప్పించు!

రా:_డాక్టరు దగ్గరకా? చేతిలో కాని డబ్బు లేకుండా పోతే మనవంకైనా చూస్తాడా!

గం:_అయితే పిల్ల ప్రాణాలకు ఆశ వదలుకోవలసిన దేనా?

రా:-(వలవలలాడుతూ) కాదు గంగులూ _ కాదు_ మన బిడ్డను రక్షించుకో కలుగాలి. ఇదుగో బయలు దేరుతున్నాను. డాక్టరుకు మనపట్ల దయకలిగి తప్పకుండా మందిస్తాడు.

(రాజయ్య నాగమణిని ఎత్తుకొని భుజాన పడుకోబెట్టుకుంటాడు.)

గం:_బయలుదేరు! డాక్టరును ప్రాధేయపడి, బాగా చెప్పి మంచిమందు అడుగు.

రా:_(గద్గదస్వరంతో) మన స్థితిగతులను వివరంగా చెప్తాను. (రాజయ్య బయలుదేరి వెళ్లిపోతాడు.)

♦ ♦ ♦

(వైద్యశాల - డాక్టరు వచ్చిన రోగులను పరీక్ష చేసి సలహాలిస్తూ మందులు వ్రాసి యిస్తుంటాడు. కంపౌండరు హడావిడిగా మందు లిస్తూ డబ్బు వసూలు చేస్తుంటాడు. చినిగిన కట్టుగుడ్డలతో రాజయ్య బిడ్డను భుజాన పడుకోబెట్టుకొని అక్కడ వరండాలో ప్రక్కగా నిలబడియుంటాడు.)

డాక్టరు:-మందు వ్రాసి యిస్తున్నాను; దీనిని తీసికొని వెళ్లి వేడినీళ్లతో రోజుకు మూడుసార్లు పుచ్చుకో! నీ జబ్బు నయమగుతుంది.

ఒక రోగి:_అలాగే డాక్టర్! (చీటీ తీసికొని మందు కొరకై వెళతాడు.

ఒక స్త్రీ:_డాక్టరుగారూ! నాకు రెండు రోజుల నుండి జ్వరం, వాంతులూను.

డా:-(స్టెతెస్కోపుతో పరీక్ష చేసి) పైత్యజ్వరము. మందువ్రాసి యిస్తాను - తీసికొనివెళ్లి త్రాగితే ఒకటి రెండు రోజులలో జ్వరం, వాంతులు తగ్గి పోతవి. జ్వరము తగ్గేదాక అన్నము తినబోకు! గంజి, రొట్టెలాంటి ఆహారం మంచిది.

స్త్రీ:-మంచిదండీ! (వెళ్లి పోవును).

డాక్టర్:-(రాజయ్య వంకజూచి) ప్రొద్దున్నే ప్రత్యక్షమయ్యావా! బిచ్చగాండ్ర బాధ యింత అంత కాకుండాయుంది.

రా:_(కంటతడి పెడ్తూ) క్షమించండి బాబయ్యా! నేను డబ్బు దుగ్గాణి కోరడానికి వచిన బిచ్చగాణ్ణి కాను. నాబిడ్డ ప్రాణాలను కాపాడుకో డానికి వచ్చినవాడిని - కనికరించాలి!

డా:_నీ బిడ్డకేమిటి? - యిలాగ తీసికొని రా.

(రాజయ్య నాగమణిని తీసికొని వెళ్లి డాక్టరు ముందు బల్లమీద పడుకోబెట్టాడు. పరీక్ష జరిగింది.)

డా:-(చీటీవ్రాసి యిచ్చి) పోయి మందు తీసికొని వెళ్లు రెండు రూపాయలు ఖరీదగుతుంది.

రా:-(బల్లమీద పడుకొనియున్న పిల్లను దీనంగా చూస్తూ నిలబడతాడు).

డా:_ఇంకా ఎందుకలా నిలబడతావు?

రా:_నా దగ్గర డబ్బు లేదు బాబయ్యా! కటిక దరిద్రుణ్ణి.

డా:-అందుకు నేనేం చేయకలను?

రా:_మీరు ఎందరికో నాబోటి నిరుపేదలకు మందిచ్చి ఆదరించియుంటారు. వారు మీకు కృతజ్ఞతను తెలిపియుంటారు. నేనింతవరకు ముందెప్పుడూ వచ్చి మీ సహాయం కోరలేదు. ఈ రోజైనా నాబిడ్డ ప్రాణాలను రక్షించుకోడానికని ఆదుర్దాతో మీ పాదాల నాశ్రయించాను.

మీ దయానుగ్రహాలమీదనే బిడ్డప్రాణాలు ఆధారపడియున్నవి.

డా:-ఏమిటయ్యా! ఏదో దీర్ఘంగా ఉపన్యాసం దంచేస్తున్నావ్!

రా:-అవును బాబయ్యా! నా జీవితమే ఉపన్యాస వేదికగా మారిపోయింది. (డాక్టరు కాళ్లు పట్టుకొని కండ్లనీరు కారుస్తూ) ఏనాటి కానాడు జీవనము చేయడమే దుర్లభముగానున్న కూలివాడను. నా సంపాదన నాకు, నా పెళ్లాం బిడ్డలకు ఒంటిపూటైనా అన్నానికి సరిపోదు. ఈ పరిస్థితులలో రెండు రూపాయలను యిప్పుడెక్కడనుండి తేగలను! బిడ్డముఖం చూడండి డాక్టరుగారూ! కనికరించి పుణ్యం కట్టుకోండి!

డా:-లేవవయ్యా! లే.. ఈసారికి మందిప్పిస్తాను తీసికొని వెళ్లి యికముందెప్పుడూ యిలాగ రాబోకు! ఏదో బీదవాడివని యీ సహాయం చేస్తున్నాను. నేనూ మందులను డబ్బిచ్చే కొనాలి. (కంపౌండరును పిలిచి మందు తెప్పించి యిచ్చాడు)

రా:-న్యాయానికి, నీతికి కట్టుబడి యింతవరకు జీవయాత్ర సాగిస్తున్నాను బాబయ్యా! మీ చేతులతో యిచ్చేమందే నాబిడ్డ ప్రాణాలను రక్షించాలి. మీ చల్లని చేతులతోనే మొదటిసారి మందు వాడండి!

(డాక్టరు గ్లాసులో మందుపోసి నాగమణి నోట్లో పోయును.)

రా:-ధన్యవాదాలు డాక్టరుగారూ! వెళ్లివస్తాను.

డా:-మంచిది - అలాగే పోయిరా.

◆ ◆ ◆

(రాజయ్య పిల్లనెత్తుకొని, ఒకచేత్తో మందుబుడ్డీ పట్టుకొని యింట్లోకి ప్రవేశిస్తాడు.)

గం: (ఆదుర్దాతో) డాక్టరు చూచి మందిచ్చాడా?

రా:-(నాగమణిని మంచంమీద పడుకోబెట్టి గుడ్డ కప్పుతూ) యిచ్చాడు.

గం:-నాకు ఆకలి దహించుకపోతున్నది.

రా:-నీవు పసిపిల్లలాగ మాట్లాడుతున్నావు గంగులూ! నేను పడుతున్న యమయాతనలను నీవు చూస్తూనే యున్నావు కదా!

గం:-ఆకలితో నేను నకనకలాడుతుంటే నీవనవలసినదిదేనా!

రా:-అవును - అంటున్నాను. నేను పాలు, పండ్లు ఆరగించి సుఖపడుతూ మిమ్మలను...

గం: ఆకలితో శోషవచ్చి కండ్లు తిరిగిపోతూ, చెవులు దిబ్బెళ్లు పడుతున్నవి.

రా:-సంపన్నులకుండని యీ యాకలి మనకుండటం సహజమే గంగులూ! నీకు తెలియకుండా నే నెక్కడైనా డబ్బు, దుగ్గాణి దాచియుంచానా?

గం:-ఎన్నాళ్లీ దహించుకపోయే ఆకలి బాధను సహించగలను? పెళ్లాం బిడ్డలకు కూడు పెట్టలేని మగవాడికి పెళ్లి ఎందుకు? నాకీ దిక్కుమాలిన జన్మ మెందుకురా భగవంతుడా!

రా:-తొందరపడి మాట్లాడుతున్నావు గంగులూ! పెళ్లి చేసికున్న వారంతా పంచభక్ష్య పరమాన్నాలతో, మేడల్లో, మిద్దెల్లో భార్యలను సుఖపెడుతున్నారనా నీ యూహ! ఏ కొందరికో ఆ యవకాశాలు. ఆస్తిపాస్తులు లేకపోయినా, ఆడంబరం లేకపోయినా ఉన్నంతలో ఏదో కలో గంజో త్రాగి తృప్తిగా కాలంగడిపేవారి సంఖ్యే జాస్తి.

గం:-(తల వంచుకొని) ఇక నేనేమి నిన్నడుగను. (తల పైకెత్తి దిగజారిపోయిన పైకప్పును చూపిస్తూ) వచ్చేవి వర్షాకాలపు రోజులు...

రా:-గంగులూ! మన కష్టాలు, దరిద్రము స్థిరముగానున్నంతకాలము సూర్యకిరణాలు, చంద్రకిరణాలు మన యింట్లో చొచ్చుకొని వస్తూనే యుండేవి.

గం:-అందుకని!

రా:-ఓపికపట్టాలి.

గం:-ఓర్పుకైనా హద్దుపద్దులేవి యుండాలా!

రా:-ఇటువంటి సమయాలలోనే మనము ఓర్పు వహించాలి.

(కొంతసేపట్లో ఆకాశం మేఘాలతో నిండిపోయి, ఉరుములు, మెరుపులతో వర్షము కురువ ప్రారంభించింది.)

గం:-ఇలాగ ఎంతకాలము కురుస్తున్న కొంపలో నుండగలం?

రా:-అమ్మాయిని ఎత్తుకొని భుజాన పడుకోబెట్టుకో! యీ రోజుకు ప్రక్కనున్న సత్రంలో తల దాచుకుందాము. తడవకుండా అమ్మాయికి గుడ్డకప్పి బయలుదేరు.

(పిల్లనెత్తుకొని గంగులు, రాజయ్య బయలుదేరి వర్షంలోనే వెళతారు.)

◆ ◆ ◆

(సత్రంలో నాగమణి ఆకలయి ఏడుస్తుంటుంది.)

రా:- అమ్మాయిని బుజ్జగిస్తుండు! పోయి ఎక్కడైనా రొట్టెయినా తెస్తాను.

గం:- ఈ ఉరుముల, మెరుపుల కుంభవర్షంలో ఎక్కడికి వెళ్తేను? వద్దు! వద్దు! ఎంత గట్టిమనసు గలదైనా యీలాటి సమయంలో భర్తను బయటికి పంపదు.

రా:- పిల్ల యిలాగ ఆకలికి నకనకలాడి పోతుంటే మనం చూస్తూ ఎలాగ సహించగలం!

గం:- నాకేదో భయంగా వున్నది.

రా:- భయమా! మనం భయపడితే చేయగలదేమున్నా? త్వరగా వస్తాను యిక్కడే యుండండి! (కటిక చీకటయినా కుంభవర్షంలో వెళతాడు)

గం:- (భర్తపోయినవైపే చూస్తూ) ఇంత వర్షంలో ఎక్కడికి వెళ్తాడో పాపం! (నాగమణిని బుజ్జగిస్తూ) మీ అయ్య నీకు రొట్టె తేవడానికని ప్రళయాన్నికూడ లక్ష్యం చెయ్యకుండా వెళ్లాడు. కల్ల, కపటం ఎరుగని ప్రేమమూర్తి. నేను నిందించాను — ఆలోచనలేకుండా మీ అయ్యను. (కంట తడిపెడుతుంది. కొంచము సేపటికి నాగమణి నిద్రపోతుంది. రాజయ్య రాకకై చాలసేపు ఎదురుచూచి) మీ అయ్య యింకా రాలేదేమా చిట్టితల్లీ! ఈ గాలీ, వానలో ఏమయినాడో ఏమో! నేనైనా వెతుక్కొని వెళ్లి వస్తాను. నీవిక్కడే యుండమ్మా! — యిప్పుడే వస్తాను. (నిద్రపోతున్న పిల్లకు బాగా గుడ్డకప్పి పిల్ల ముఖమువంక పారజూచి వెళ్లును.)

(వర్షం జోరున కురుస్తుంటుంది. మహోద్ధృతంగా వీస్తున్న గాలికి మహావృక్షాలు సయితం ఊగిసలాడిపోతున్నవి. కొన్ని చెట్లు ఫెళఫెళ విరిగి పడుతున్నవి. రొట్టెకొరకని బయలుదేరిన రాజయ్య దారిలో విరిగిపడిన చెట్టుక్రింద తగులుకొని సతమతమై తెప్పరిల్లి లేచి బయలుదేరుతాడు. భర్తను వెదకుకుంటూ బయలుదేరి వెళుతున్న గంగులు, రాజయ్య కనుపించక పిడుగుపడి నిలువున ప్రాణాలు కోల్పోతుంది. రాజయ్య ఆ వర్షంలో దారి డొంక తెలియకుండా పోతుంటే అతనికి భార్య గంగులు శవం కాళ్లకడ్డు తగులుతుంది. ఎవరో! ఏమిటో! అని ఎత్తి భుజానవేసికొని తడబడుతున్న నడకతో సత్రం చేరతాడు. ఆ శవాన్ని అరుగుమీద దించి నిద్రలేచి మంచం మీద కూర్చొని ఏడుస్తున్న నాగమణికి రొట్టె నిచ్చి గంగులు కొరకు నాలుగు మూలల చూచాడు. లేకపోయేసరికి అనుమానంతోచి శవం దగ్గరకు చూడడానికి వెళ్లి గంగులును గుర్తుపట్టాడు. ఎంతో పిలిచి, తట్టి లేపాలని ప్రయత్నించాడు. కాని చనిపోయిందని తెలియగానే భోరున ఏడ్వసాగాడు. నాగమణి అమాంతం తండ్రి ఒళ్లోకి దూకి కాకి రొదగా ఏడ్వ మొదలుపెట్టింది.

రా:- (ఏడుస్తూ) మమ్ములను దిక్కులేనివారముగా చేసి వెళ్లావా! ఇక నీ పిల్ల అతీగతి చూచేవాళ్లెవరు గంగులూ!

నా: (బిక్కమొగంతో) ఏందయ్యా! అమ్మ పలుకడం లేదేం! గుడ్డలు ఒళ్లు ముద్దగా తడిసినవే!

రా:- ఇంకెక్కడి అమ్మ తల్లీ! మీ అమ్మ నన్ను, నిన్ను అనాథలుగాచేసి వెళ్లింది.

నా:- వెళ్లిపోయిందా! ఎక్కడికి? ఎదురుగానే పడుకొనేయుంది కదయ్యా!

రా:- (ఏడుస్తూనే) లేదు తల్లీ! లేదు. మీ అమ్మ చనిపోయింది. (నాగమణి, రాజయ్య శవంమీద పడి గోల్లుమంటారు. ఇరుగు, పొరుగువారు చుట్టూ గుమికూడతారు) అమ్మాయ్! మణీ! ఎందరో తల్లులు చనిపోతున్నారు. మీ అమ్మ అదాటే పట్టింది. గంగులూ! నీ కష్టాలు యీనాటితో తీరినవి. ఇక మాకు మిగిలియున్నవి. ఆకలిలాంటి బాధలిక నిన్నేం చేయలేవు. చేయలేని ఉన్నత పథం నీకు లభించింది. సహజంగా దాంపత్య జీవితంలో ఎన్నో తీయనికలలు కనియుంటావు. అవి ఫలించలేదని నన్ను నిందించియుంటావే. కాలము, పరిస్థితులు మనలనట్లు బద్ధులుగా చేసినవి. మన చిట్టితల్లి ముద్దుముచ్చట్లు నేవీ చూడకుండానే నీవు దాటిపోయినావు. గంగులూ! చివరి ఘడియలలో ఏమని తపిస్తూ కండ్లు మూశావో! సుఖమే నా సుఖముగా భావించిన నేను నాగమణి సుఖసౌభాగ్యముల నుద్దేశించి ఎట్టి త్యాగమైనాచేసి కష్టపడతాను - ఇది నీ శవంముందు నా ప్రమాణం.

(నాగమణి ఏడుస్తూ యుంటుంది.)

రాజ:- తల్లిని పోగొట్టుకున్నావు. తల్లిలేని బిడ్డను పెంచి పెద్దజేసే భారం నామీదపడింది - అమ్మ రూపం సయితం మరుగైపోయే క్షణాలు దగ్గరకు వస్తున్నవి. చూడమ్మా అమ్మను తనివితీర. ఒక్కసారి దణ్ణం పెట్టు; ఇక మనకీయమ్మ రూపంక

నుభవించదు. మిగిలేది ఆమె ప్రేమా స్మృతు లు మాత్రమే

(నాగమణి గోడుగోడని ఏడుస్తూ శవంమీద పడుతూ లేస్తుంటుంది,

రాజ:_ఏడవద్దమ్మా! ఏడ్చిమాత్రం మనం చేయకలిగేది ఏమున్నది? మన ధర్మాన్ని నిర్వహిస్తేనే మీఅమ్మ అయినా పరలోకంలోనుండి తృప్తి చెందుతుంది. కొంతసేపటిముందుదాక మనతో బాటుకష్టసుఖాలనుభవించినది. యిప్పుడు నిర్జీవయై కటికనేలకొరిగినది. ఇంకా కొంచము సేపటికి ఆమె శరీరం భూమిలో పదిలంకాబోతున్నది.

(నాగమణి క్రిందపడి దొర్లుతూ ఏడుస్తుంటే గంగులు మృతకళేబరాన్ని స్మశానానికి తీసికొని వెళతారు)

♦ ♦ ♦

(పది సంవత్సరముల తరువాత - రాజయ్య ఏదో ఆలోచిస్తూ యింట్లో అటూయిటు తిరుగుతుంటాడు. నాగమణి దొడ్లోనుండి యింట్లోకి వస్తుంది)

నాగ:_ఏందయ్యా! ఆలోచిస్తున్నావు?

రాజ:-ఏమి లేదమ్మా!

నాగ:_నీ ముఖమే చెప్పుతున్నది - ఏమిటో చెప్పవూ!
(ప్రక్కనవచ్చి నిలబడుతుంది)

రాజ:_మరేముందమ్మా! నిన్నుగురించే ...

నాగ:_ఎందుకయ్యా!

రాజ:_నీవింకా పసి పిల్లలాగే మాట్లాడుతున్నావమ్మా! నీవు ఆడపిల్లవన్న సంగతి నీకు తెలియలేదు.

నాగ:_అందుకని?

రాజ:_నీవు రోజాపువ్వువమ్మా!

నాగ:_ఏమిటీ ధోరణి ...

రాజ:_చెట్టునుండి పువ్వున్ని ఎవరుపడితే వాళ్లు కోయకుండా కాపలాకాచేవాడిని నేను. చూపరులహృదయాలను హరించగలిగేది నీ యిప్పటి యౌవ్వన సౌందర్యాలు.

నా:_అందుకానీకీ యీ ఆందోళన! (చిరునవ్వుతో)

రా:_ఆందోళన మాత్రంకాదు; వేదనకూడాను. బరువుబాధ్యతలు నావికదా తల్లీ!

నా:. ఈ దిగులు యిప్పుడే ఎందుకులే అయ్యా!

రా:_నా ఆలోచనలన్నీ పెండ్లి, పేరంటం, సుఖ సౌభాగ్యములను గురించేనమ్మా!

నా:_(సిగ్గుతో) పో అయ్యా!

రా:_మీ యమ్మయుండి యుంటే నీ మనసులోని మాటను చెప్పుకో కలిగేదానివికదా! ముద్దు ముచ్చట్లు చూచి ఆనందించే భాగ్యం మీఅమ్మకు లేకపోయింది, అన్నిటికీ నేను మిగిలాను. మన మాపేదవారం. నీకు యీడుజోడైన సంబంధమును ఎక్కడనుండి తెచ్చి పెండ్లి చేయగలనాయనే రాత్రింబగళ్లు ఆలోచిస్తున్నాను.

నాగ:-అయ్యా! నాకొక ఆలోచనతడుతున్నది.

రా:_ఏమిటమ్మా అది!

నా:_నీవిప్పుడు దినకూలికి కదా పనిచేస్తున్నది?

రా:_నా కష్టనిష్ఠూరాల నెందుకడుగుతావులే తల్లీ!

నా:_అందుకనే నాకొక మంచిచోట _

రా:_అదే తల్లీ! నాకూ ఆదేకోర్కె_మంచి సంబంధము చూచి చెయ్యాలనే ...

నా:_అదికాదు, - అయ్యా! నీ రెక్కల కష్టానికి ఆధరవుగా నేనూ ఏదైనాపనిచేస్తే ...

రా:_నీవు పని చేస్తావా!

నా:-ఏం! ఎందుకు చేయకూడదూ? మనంయింకా ఎంతకాలము యీకటిక దరిద్రాన్ని భరించగలము? ఎక్కడైనా మంచిచోట యింటిపనికి అవకాశం చిక్కితే వేడినీళ్లకు చన్నీళ్లు తోడుగా మనదరిద్రం కొంత తీరుతుంది; నీకు శ్రమ కొంత తగ్గుతుంది.

రా:_(కంటతడిపెడ్తూ) మణీ! కని, పెంచినతండ్రిని రాయిలాగుండగా నిన్ను పడిపంచలకు వెట్టిచాకిరికి పంపించనా? నేనింతకాలము అష్టకష్టాలు పడి, శ్రమకోర్చి పెంచినది దాసీదానిగా చెయ్యడానికేనా! నా రెక్కలాడునంత కాలము నీవు చాకిరిచేయవలసిన అవసరంలేదు. ఇంతవరకు మన జీవయాత్రలో ఎదుర్కొంటున్న సమస్యలు చాలక నా క్రొత్తవానిని తెచ్చిపెట్టాలని చూస్తున్నావు?

నా:_బాగా ఆలోచించి చూడు అయ్యా! నేను ఎక్కడయున్నా నీ బిడ్డనేకదా! నీ మనస్సుకు ఏ కష్టం కలిగించనని చేతిలో చెయ్యివేసి చెప్తున్నాను,

రా:_బీదవాడినైనా ఎలాగోలాగ నిన్ను అల్లారు ముద్దుగా పెంచాను. నీవే నా సర్వస్వం, నిన్ను వదలి నేనుండలేను.

నా:_నేను మాత్రం నిన్ను ఒంటరిగాణ్ణి చేసి పోతానని అంటున్నానా అయ్యా!

రా:_సరే తల్లీ! నీయిష్టం -

నా:_ఏలాటి అపవాదు రాకుండా యుంటానని నమ్ము అయ్యా!

రా:-అంతకంటె కావల్సినదేమున్నది? నమ్మి భగవంతుని మీద భారంవేస్తున్నాను,

(సశేషము)

# రాజకుమార్

ఫ్రెంచి మూలం : ఆంధ్రానుసరణ :

అంటోనిడె సయింట్-ఎక్స్‌పూపెరీ డాక్టర్ వి. ఎస్. శర్మ



(గతసంచిక తరువాయి)

"అదంతా సరే!...కాని ఇంతకూ ఆ పాము ఎక్కడనుంచి రావటం? దాంతో ఎందుకలా కాలక్షేపం చేస్తూ వుండటం?..." అని ఎన్నెన్నో ప్రశ్నలను వాడిమీద అమాంతంగా దొర్లించటానికి ప్రారంభించాను. వాడు అన్నిటినీ సావధానంగా విన్నాడు...కాని వాటికి మామూలుకుమల్లె సూటిగా జవాబిస్తేగా! వాడి ధోరణే వాడిది. దానిని మార్చటానికి ఎవళ్ల తరమవుతుంది?

కొంచెం సేపయ్యాక అబ్బాయి ఏమనుకున్నాడో నాకేసి తీవ్రంగా చూస్తూ "ఈ లోకపువాళ్లు తమాషాగాళ్లు. అన్నీ తెలుసుకోవాలని వాళ్ల వుబలాట...ఏది ముఖ్యమైందో వాళ్లకు తెలిసివుంటేనా..." అని అంటూ చప్పున ఆగాడు.

"అంటే?" అని ఆత్రుతతో అబ్బాయిని ప్రశ్నించబోయాను.

"పూల సంగతి నీకు బాగా తెలుసుగా! నీకు బాగా నచ్చిన పువ్వు మరో గ్రహంలోకంలో వున్నదే అనుకో. అది ఎంతదూరంలో నున్నా దానికేసి చూస్తూ వుండక, దానిని గురించి ఎన్నెన్నో కలలని కనకుండా ఎలా వుండగలుగుతాం? అలాటి పూలు తండోపతండాలుగా అన్ని గ్రహమండలాలలో వుంటాయే అనుకుందాం...అయినా?" మందహాసం చేస్తూ అబ్బాయి అన్నాడు.

"అవునోయ్! నువ్వు అన్నది అక్షరాలా నిజమే" అని వాడిని ఆప్యాయంగా తడుముతూ అన్నాను.

"ఆ! అలా దోవలోకి రా!...పూలవంటివే మనం తాగేనీళ్లు కూడా! దప్పి తీరటానికి నువ్వు ఇచ్చావే ఈ బావిలో నీళ్లు. ఆ నీళ్లలో ఎంత ప్రత్యేకతవుందో... గిలక ఎంత చక్కగా తిరిగింది! అలా తిరగటంలో మనం కనీవినని సంగీతం వస్తూ ఈ వాతావరణాన్నే ఎంత చక్కగా మార్చివేసింది! దాంతో నూతినీళ్ల వ్యక్తిత్వం కూడా అమాంతంగా మారిపోయింది. అలాటి జలాన్ని తాగటం అంటే!... అమృతంకన్నా అతీతమైంది. నా దప్పిని ఎలా తీర్చిందో తెలుసా?" అని అన్నాడు అబ్బాయి.

"ఊ! దాంతో నువ్వు ఎలా మారిపోయావో నాకు బాగా తెలుసు.." అని వాడిని సమాధానపరచటానికి అన్నాను.

"రాత్రి వేళల్లో ఆకాశాన్ని తదేకంగా చూస్తూ వుండాలి. నేనుండే గ్రహమండలం ఇతర మండలాలకన్న అంత పెద్దదికాదు. అంచేత నా లోకాన్ని ఆకాశమండలంలో రాత్రిపూట గుర్తుపట్టటం అంత సులభమైన పనికాదు. అయితేనేం! నా లోకమంటే నాకు ఎంతో ఇష్టం. నీ దృష్టిలో నా లోకం ఇతర లోకాలవంటిదే అనే

అనుకుంటావు. అంచేత అన్ని గ్రహమండలాలపట్ల నీకు ఆదరం తప్పక వుంటుంది. నాకోసం అన్నిటికేసి చూస్తూ వుంటావు. నాకోసం ఇంత ఆప్యాయం చూపబోతూ వున్నందుకు నీకు మంచి బహుమతి ఇయ్యాలని నా ఆశ'' అని మందహాసం చేస్తూ అన్నాడు అబ్బాయ్.

''అస్తమానమూ నువ్వు ఇలా మందహాసం చేస్తూ వుండాలనే నా కోరిక..'' అని వాడిని ఆప్యాయంగా నిమురుతూ అన్నాను.

''నీకు ఇయ్యబోయే బహుమతికూడా అదే!....అప్పటి అమృత పానీయాలకు మల్లె దీని ప్రత్యేకతనుకూడా నువ్వు బాగా అవగాహనం చేసుకోగలుగుతావు'' అని చప్పట్లు కొడుతూ అబ్బాయి అన్నాడు. ఆ చిరునవ్వు కల్లారచూసి తీరాలి. దాంతో వాడి విగ్రహమే పూర్తిగా మారిపోయిందని అనాలి.

''అబ్బాయ్! ఇల్లా ఎప్పుడూ నవ్వుతూ వుంటివా నా తాపత్రయాలన్నీ పటాపంచలయి పోతాయి. ఇదే నాకు కావాలసిన బహుమానం....'' అని అన్నాను.

''నేను ఇయ్యబోయే బహుమానం దీనిని ఇదే! ఆ జలానికిమల్లె చూసుకుంటూ వుండాలని నా ఆశ'' అని మందహాసం చేస్తూ అన్నాడు.

అంటే! ''అబ్బాయి ఏమి చెప్పదలచుకున్నాడో చప్పున తెలుసుకోవాలనే వుబలాటంతో ప్రశ్నించాను.

''ఈ లోకపు జనానికి గ్రహమండలాలను చూడటమంటే ఎంతో సరదా. వాటిని వాళ్ల వాళ్ల పంథాల్లో అర్థం చేసుకుంటూ వుంటారు. కొంతమంది వాళ్లు చేసే ప్రయాణాలకు దోవనిచూపే శక్తులని అనుకుంటాను ఈ నక్షత్రాలని. మరి కొంత మంది దృష్టిలో ఇవి మిణుక్కు-మిణుక్కుమని వెలుగుతూవుండే చిన్న దీపాలు. ఇంకా కొంతమంది వున్నారు. వాళ్లు పండితులు. గ్రహమండలాల సంగతి తమకొక్కళ్లకే తెలుసునని అనుకుంటారు. వీళ్ల దృష్టిలో ఈ గ్రహమండలాలన్నీ పెద్ద సమస్యలు!...ఇక నా స్నేహితుడు వున్నాడే! ఆ పెద్ద వర్తకుడు! ఆయనకు ఈ గ్రహమండలాలన్నీ బంగారుగనులు!... లోకులు వాటిని గురించి ఏమనుకున్నా అవిమాత్రం ఈ నాటకాన్నంతా చూస్తూ మందహాసం చేస్తూ వుంటాయి వాటివాటి పంథాల్లో... నీకూ నక్షత్రాలు అంటే ఎంతో ఇష్టమన్న సంగతి నాకు తెలుసు. కాని నీ దృష్టి మాత్రం మరోవిధంగా వుండటం ముఖ్యం...'' అని ఏమో చెప్పబోతూ ఆగాడు.

''ఎందుకలా ఆగటం? సూటిగా చెప్పివేయరాదూ, నీ మనస్సులో వున్నదంతా!'' అని ప్రాధేయపడుతూ అడిగాను.

''రాత్రిళ్లు ఆకాశమండలాన్ని తదేక దృష్టితో చూడటమంటే నీకు ఎంత ఇష్టమో నాకు తెలుసు. నీ దృష్టిలో నక్షత్రాలన్నీ మందహాసం చేస్తుంటాయని నాకునుల్లె. అంచేతనే అన్నిటిలో నువ్వు చూడాలని తాపత్రయపడేది ఈ మందహాసం కోసమే'' అని అంటూ నాకేసి చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

తిరిగీ తన ధోరణిలో పడిపోతూ "నీకూ ఎన్నెన్నో కష్టనిష్ఠూరాలు వుంటూ వుంటాయి. అలాంటప్పుడు నిన్ను చేరదీసి బుజ్జగించటానికి ఎవళ్ళయినా కావాలని ఆతృతపడుతూ వుంటావు కదూ! అంచేతనే నాకోసం ఆకాశమండలమంతా కలయచూడటానికి వుబలాటపడతావు... నిన్ను వదిలిపెట్టేసి నా లోకానికి వెళ్ళాలసి వచ్చినా నిన్ను ఎలా మరచిపోతాను? నువ్వు నా స్నేహితుడివి. దగ్గరవున్నా లేకపోయినా, నా ధ్యాసంతా నీమీదే. నువ్వు బాగా నచ్చావు. ఇప్పుడే కాదు, సర్వకాలావస్థల్లో కూడా నువ్వే నా నేస్తంగా వుండిపోవాలని నా కోరిక. నేను ఎక్కడ వున్నా సరే, నా కేసి చూస్తూవుండు. నన్ను నవ్విస్తూ వుండు. నీయీ వాలకం నువ్వు నీ స్నేహితుల మధ్య వుండేటప్పుడు, బహుశా వాళ్ళకు నచ్చకపోవచ్చు. ఎడారి వాతావరణం మూలాన పిచ్చివాడివై పోయావని వాళ్లు నిన్నుచూస్తూ విస్తుపోతూ వుండవచ్చు. అలాటివాళ్ళని ఎంత సమాధానపరచినా ప్రయోజనం వుంటుందా? ఇతర్లు నిన్ను గురించి ఏమనుకున్నా సరే, నువ్వు నా స్నేహితుడివే" అని చప్పట్లుతడుతూ అన్నాడు అబ్బాయి. వాడిలో ఆ సమయంలో రేకెత్తుతూవున్న ఆనందప్రవాహాన్ని ఎలా వివరించగలుగుతాను ..!

ఆ ఆనందం మరో నిమిషంలో మాయమైపోయింది. తిరిగీ బెదురుచూపులతో నా కేసి చూస్తూ "ఇవ్వాళే ఈ రాత్రే! .. ఆ సంగతి ఇంతకుముందే చెప్పానుగా...నువ్వు మాత్రం నా వెంట రావద్దు..." తడబడుతూ అన్నాడు అబ్బాయి.

వాడిని అలా భయపడవద్దని ప్రాధేయపడుతూ "నిన్ను ఇలా ఏకాకిగా వదిలేసి వెళ్తాననుకున్నావా, అబ్బాయీ!" అని అన్నాను.

"నువ్వు నావెంట రావటం మంచిది కాదు. ఆ దృశ్యాన్ని చూడటమా? .. చూస్తే వాడలిపోవూ!"

"ఫరవాలేదు. నిన్ను వదిలిపెట్టి వెళ్లను" అని భుజాన్ని తడుముతూ అన్నాను. కాని అబ్బాయి నా మాట వింటేగా! వాడి పట్టే వాడిది. నన్ను చీకటిపడకముందే నేను మకాం చేస్తున్న చోటికి వెళ్లిపొమ్మని పట్టుపట్టాడు.

"అబ్బాయి! నువ్వు ఇలా పట్టుపట్టడం బాగాలేదు...ఈ పరిసరాలలో పాములు వుంటాయి. ఇక్కడి పాములు విషజంతువులు. వాటినుంచి నిన్ను కాపాడే బాధ్యత నాదన్న సంగతి నువ్వు అర్థం చేసుకోవాలి...ఈ పాముల సగదా దోవలో కనబడ్డవాళ్ల ప్రాణాలని కాటేయాలనే...." అని అన్నాను.

ఆ మాటలతో అబ్బాయి కొంతవరకు శాంతించాడనే అనవచ్చు. "నువ్వు అన్నది సబబుగానే వున్నది ...అలాటి పాములే రెండోసారి కాటువేస్తే, దాన్లో ఏమాత్రం విషం వుండదని అంటారే..." అని మొహాన్ని ఎంతో పెద్దదిగా చేసుకుంటూ అన్నాడు అబ్బాయి.




# చలనచిత్ర రంగంలో స్త్రీలు తమ అవకాశాలను మెరుగుపరచుకోవాలి!

విదేశాలలోని మహిళా ఉద్యమాన్ని చూచి అన్ని రంగాలలో పురుషులతో సమానంగా జాతీయ బరువు భారాలను, బాధ్యతలను వహించాలని ముందడుగు వేస్తున్న భారత నారీలోకం చలనచిత్రరంగంలో నటీమణులుగా తప్ప మిగతా బాధ్యతలకు పూనుకోక పోవడం శోచనీయము. ముఖ్యంగా మన దక్షిణ దేశంలో స్త్రీలు నిర్వహిస్తున్న పాత్ర అత్యల్పమని చెప్పాలి. విదేశాలలాంటి రష్యా, అమెరికా, జపాను మొదలగు వానిలో చలనచిత్ర పరిశ్రమలో పురుషులతో సమానంగా స్త్రీలు స్క్రిప్టురచయిత్రులుగాను, కళాకారులుగాను, శబ్దగ్రాహకులుగాను, చిత్రలేఖనం, శిల్పం, సంగీతం, నృత్యంలాంటి కళాదర్శకులుగాను విమర్శకులుగాను, నిర్మాతలుగాను, సినిమారచయిత్రులుగాను అనేక మంది రూపొంది సమర్థంగా తమ బాధ్యతలను నిర్వహిస్తూ తమకు, దేశానికికూడ అఖండకీర్తి ప్రతిష్టల నార్జించుచున్నారు. అట్టివానిపట్ల ముఖ్యంగా మన దక్షిణ దేశంలో, స్త్రీలకు ఆసక్తియున్నట్లు అట్టేకనుపించదు. నటీమణులుగానో లేక నేపథ్యగాయకులుగానో తప్ప యితర శాఖలలో స్త్రీలు బహుకొద్దిగా నున్నారు. ఇందుకు కారణం చలనచిత్రరంగంలో నైతికంగా తమకు రక్షణలేదని స్త్రీలుభయపడుట ఒకటి. మరొకటి యిప్పుడు స్త్రీలు ఆర్జించేవిద్య విజ్ఞాన అనుభవాలు గుమాస్తాగిరిలాంటి బాధ్యతలకు తయారుచేస్తున్నవే కాని వారిలోని కళాతృష్ణను, అభ్యుదయభావాలను వికసింపజేయడములేదు. పైగా చలనచిత్రరంగంలో వివిధరంగాలలో బాధ్యతలు నిర్వహించడానికి సుశిక్షితులనుచేయు కేంద్రాలు పేర్కొనతగినవిలేవు. సాంకేతిక నిపుణులుగా శిక్షణ పొందుటయనునది పూర్తిగాస్టూడియో యజమానులు, నిర్మాతల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి యున్నది.

సుశిక్షణకవకాశములు విస్తృతమై, చలనచిత్ర పరిశ్రమలో తమవ్యక్తిత్వానికి భద్రత, రక్షణయున్నదను ఆత్మవిశ్వాసం ఏర్పడిననాడు స్త్రీలు చలన చిత్ర పరిశ్రమలో అన్నిశాఖలలో సమర్థంగా కృషిచేయ గలరు. ఇందుకు ప్రజాసామాన్యంతోబాటు మహిళా సంఘాలు ఆందోళనచేయాలి. ప్రభుత్వముసహకరించాలి!

ఇదిలాగుండగా నటీమణులుగా అనేకసంవత్సరాలు చలామణియయిన తరువాత తాము పరిశ్రమలో ఆర్జించిన అనుభవవిజ్ఞానములతో దర్శకులుగాను, నిర్మాతలుగారూపొందవచ్చును. ఇందుకు నటీమణులుగా ఎన్నికయగుటకుకూడ సంగీత సాహిత్యాలలో చక్కని నైపుణ్యము, ఉన్నతవిద్యయున్నచో వారికి పరిశ్రమలోగల అవకాశాలు విశేషము. నటీనటులలో విద్యావంతుల సంఖ్య పెరుగుటవలన చలనచిత్ర రంగంలో నైతికస్థాయి మెరుగైనదికాగలదు.

శ్రీశాంతారాం, శ్రీపృథ్వీరాజ్, షోరబ్ మోడీ లాంటి వారి కళారాధన, కృషి వారు, నిర్మించిన, నటించినచిత్రాలలో ప్రతిఫలిస్తూంటవి. అంటే సుదీర్ఘమైనకృషి, అనుభవము, కళాతృష్ణ యున్నప్పుడే చలన చిత్రరంగంలో ఏ బాధ్యతలనైనా సమర్థంగా నిర్వహించవచ్చును.: వీనికి సుశిక్షణతోడు పడగలదు.

ముందుముందైనా స్త్రీలు పురుషులతో బాటు చలనచిత్ర పరిశ్రమలో సమానంగా అభివృద్ధికితోడ్పడటంతోబాటు స్వీయసౌభాగ్యాన్ని తీర్చిదిద్దుకోడానికి అవకాశాలు ఏర్పడతవని ఆశిద్దాం! స్త్రీల ఆసక్తి అయినా నటీమణులగుటతో పరిమితంకాక సాంకేతిక నైపుణ్యమును సయితము ఆర్జించుటకు, ఉత్తమరచయితలుగా, విమర్శకులుగా, స్క్రిప్టు రచయిత్రులుగా రూపొందడానికి వలసిన విద్యావిజ్ఞానములపట్ల ఆసక్తి చూపగలరని ఆశిద్దాం!

'పరివ్రాజక'

(264 వ_పేజీ తరువాయి)

'ఉన్నపళంగా ఎలా చెబుతార్రా ?... రా...లోపలికి రా!' అన్నారు మంత్రి గారు.

'భోజనం చేశావా ?...' అని అడిగారు ప్రసిడెంటుగారు.

'లేదు బాబయ్యా!...మా అడది... కనుక్కు_రమ్మని పోరిడితే వచ్చిన్ను!... బయటోళ్లు అయితే లెక్క సరిగా సెప్ప రని...మీకాడికి వచ్చిన్ను!...' అన్నాడు నూకాలు,

'సరే, ముందు భోజనం చెయ్యి! తర్వాత చెబుతాను!...' అన్నారు ప్రసిడెంటుగారు.

మంత్రిగారు వచ్చారని చేసిన పిండి వంటలతోనూ, పులావుతోనూ...మంత్రి గారి పక్కన కూర్చొని కడుపునిండా అన్నం తిన్నాడు నూకాలు.

తర్వాత -

'ఊరేమ్...ముందా బంగారం తీసుకు రా!...చూసి చెబుతాను!...ఇప్పుడే తీసు కురా!...' అన్నారు ప్రసిడెంటుగారు చెయ్యి తుడుచుకుంటూ.

'అసలు బంగారం యాడది బాబయ్యా!...నూ అడది కనుక్కు_రమ్మంది!...అంతే!' అన్నాడు నూకాలు.

దాంతో ప్రసిడెంటుగారికి చాలా కోపం వచ్చింది. 'ఫో...బయటికి!...చెప్పినదానికి బుద్ధి లేకపోతే...అడిగేవాడివి నీకు లేదురా!...' అన్నారు ప్రసిడెంటుగారు.

నూకాలు లోలోపల నవ్వుకుంటూ బయటికి వచ్చేశాడు!...

'నా వడ్లబస్తా నాకివ్వవయ్యా... నాయుడూ!...' అన్నాడు నూకాలు, నాయుడితో.

'ఇవ్వాల్సిందే నంటావా...?' అన్నాడు ఏడుపుముఖం పెట్టి నాయుడు

'మరి పందెమంటే...పందెమేం!.. అన్నాడు నూకాలు. గట్టిబుర్ర!...

ఇచ్చేమని చెప్పారు పెద్దలు.

ఏడుస్తూ వడ్లబస్తా యిచ్చేశాడు నాయుడు!...

నూకాలు 'బ్రేవు'మని తేనుస్తూ... బస్తా పుచ్చుకున్నాడు!...

# వింధ్యాద్రి గర్వభంగము

శ్రీ పేరి [redacted]శ్వేశ్వరశర్మ



(గతసంచిక తరువాయి)

ఇంద్రాదులంతా కాశీ చేరుకొని మణికర్ణికా ఘాట్‌లో సచేలస్నానంచేసి, తీర్థవాసముకొరకు వచ్చిన జనులను రత్నసువర్ణ వస్త్రాభరణములతోను, వివిధములైన సువర్ణ రజతాది పాత్రలతోను, అశ్వములతోను, ధేనువులతోను అమృతమువలె స్వాదిష్టములైన పక్వాన్నములతోను, పంచసార పాయసములతోను సంతోషపెట్టి పిదప ప్రతి దేవాలయము నందును పురాణ పాఠకులను నృత్య గీతాదులను ఏర్పాటుచేసి పడిపోయిన దేవాలయములను తిరిగి కట్టించి అచ్చట చిత్రలేఖనాదులకు రంగవల్లులకు ఏర్పాటుచేయించి ధూపదీపనీరాజనాదులకు, పంచామృత స్నానములకు సుగంధస్నానాదులకు ఏర్పాటు చేయించి యింకను బహువిధములైన క్రియాకలాపములనుచేసి ఐదు రాత్రులుపవాసముండి నానా తీర్థములందు స్నానంచేసి ప్రభువైన విశ్వనాథుని, అన్నపూర్ణయైన విశాలాక్షిని దర్శించి, బ్రహ్మచర్యాది నియమములతో ఈవిధంగా కాశీక్షేత్రాన్ని అంతా అలంకరించి విశ్వనాథుని స్తుతించుచూ పరోపకార పరాయణుడైన అగస్త్యమహర్షి ఆశ్రమాన్ని చేరుకున్నారు.

అగస్త్యమహర్షి తనపేరిట ఒక ఈశ్వరలింగాన్ని స్థాపించి దానికెదురుగ ఒక కుండాన్ని నిర్మించి నిశ్చలమనస్కుడై శతరుద్రీయ సూక్తాలతో విశ్వనాథునికి అభిషేకం చేస్తున్నాడు. మండుచున్న అగ్నివంటి అంగాలతో రెండవ సూర్యునివలె ప్రకాశిస్తూ ఉన్న అగస్త్యమహర్షిని సురాదులంతా దూరంనుండియే చూచి తమలో తాము ఈవిధంగా అనుకొన్నారు.

సాక్షాత్తు దావాగ్నిరూపం ధరించి తపస్సు చేస్తున్నదా లేక లోకములోని సమస్త తేజఃపుంజాలు ఈ బ్రాహ్మణశరీరాన్ని ఆశ్రయించి శాంతమైన పదవిని పొందుటకై పరంధాముడైన విశ్వేశ్వరుని కొల్చుచున్నావా ఏమి? ఈయన తేజస్సుకు తాళజాలక సూర్యుడు, అగ్ని యిద్దరూ కంపించుచున్నారు. ఈయనయొక్క ఉగ్రమైన ప్రకాశానికి [illegible] విద్యుత్తుకూడ అచంచల అయింది. మరియొక విచిత్రం. ఈ మహర్షి తపోవనమునందు పరస్పర విరోధస్వభావాలు గల జంతువులు కూడ తమ స్వాభావిక వైరాన్ని విడచి స్నేహముతో మెలగుతున్నాయి. ఏనుగు తన తొండముతో నిర్భయంగా సింహాన్ని గోకుతోంది. అట్లనే సూకరము తన గుంపును వీడి అడవికుక్కల మధ్య హాయిగా విహరిస్తోంది. లేడిపిల్ల ఆడపులినుండి పిల్లలను ఎడముచేసి తాను నిర్భయంగా తోకనాడిస్తూ చొంగనోరులో పులిపాలను త్రాగుచున్నది. అట్లనే బహురోమములుగల భల్లూకంమీద వాలిన పురుగులను కోతి తన దంతాలతో హాయిగా భక్షించుచున్నది. ఎఱ్ఱకోతులు, నల్లకోతులు, పండుకోతులు మున్నగు కోతి జాతులు పరస్పరము వైరభావమును విడచి ఒకేచోటున నివసిస్తూ ఉన్నాయి. చెవుల పిల్లులు నిర్భయంగా తోడేళ్లతో ఆడుకొంటూ ఉన్నాయి. ఎలుక, పిల్లి చెవిని గోకుతూ హాయిగా ఉన్నది. పాము నెమలిమీద కూర్చొని హాయిగా ఉన్నది. పాము పడగపైన ముంగిస కూర్చొని వైరభావాన్ని వీడి లీలగా ఆడుకొంటూ ఉన్నది. సర్పము ఆకలిమంటల తాళలేకపోయినప్పటికీ తనకు ప్రక్కగా పోవుచున్న ఎలుకను ముట్టనైన ముట్టుట లేదు. ఎలుక కూడ దానినిచూచి భయపడుటలేదు. అప్పుడే ప్రసవించిన లేడిని చూచి పెద్దపులి కరుణకలదై దానిమీదకి ఉరకక దూరముగా పోతున్నది. ఆడపులి, లేడి తమ భర్తల చేష్టలను ఒకరితోనొకరు చెప్పుకొనుచున్నాయి. ఈవిధంగా అగస్త్యమహర్షి ఆశ్రమం చుట్టూఉన్న జంతుజాలం పరస్పరము వైరమును విడచి స్నేహముతో మెలగుట చూచి ఆహా! ఇచ్చటనున్న పశుపక్ష్యాదులు జ్ఞానముకలవి. వీటికిక తిరిగి జన్మ లేదుగద. కాశీనివాసముచేయు పతితులతో కూడ మనము సమానులము కాము. కాశీలో పాతిత్యము గల్గినప్పటికి భయము లేదు. కాని స్వర్గములో పాతిత్యము గల్గినయెడల భయము ఉండును. ఇతరత్ర నిష్కంటకమైన సామ్రాజ్యాన్ని అనుభవించుటకన్న [illegible]

కాశీనివాసము చేయుట మిక్కిలి ఫలదాయకము. కాశీలో వాసము చేయు చీమలకు, దోమలకు లభించు పరమగతి యితర ప్రదేశములలో నివసించు యోగీశ్వరులకు కూడ లభించదు. కాశీవాసము చేయు అకించనుడైన వ్యక్తికూడ యమునినుండి భయపడడు. మనము దేవతలమని, స్వర్గవాసులమని కావున అందరికంటె గొప్పవాళ్లమని అనుకొంటూ ఉంటాము. కాని మనం వింధ్యపర్వతమునుండి భయపడుతున్నాము. అది పెరిగి సూర్యగమనానికి అడ్డు తగులగానే మనకీ దుర్దశ యేర్పడింది. బ్రహ్మయొక్క పగటి యెనిమిదవ భాగమున లోకపాలురతోనూ, సూర్యచంద్రాదులతోను, గ్రహనక్షత్రాదులతోను సహా యింద్రపదవి నష్టమవుతుంది. కాని రెండు పరార్థములు గడచినా కాశీపురిలోని యే ప్రాణీకూడ నశించదు. కాశీ నివాసమువల్ల లభించు సుఖము బ్రహ్మాండమండల మందెచ్చటా లభించదు. అందుకనే అందరు కాశీనివాసము కోరుతూ ఉంటారు. కాని అందరకు అది లభిస్తుందా. గతించిన వెయ్యి జన్మలలో సంపాదించిన పుణ్యపరిపాకమువల్ల కాశీనివాసము లభిస్తుంది. ధర్మార్థ కామ మోక్షములను నాలుగు పురుషార్థములు కాశీలో వర్ధిల్లినట్లు యితరత్రా వర్ధిల్లవు. విశ్వేశ్వరుని ఆలయానికి బద్ధకంతో ఒళ్లు విరుచుకుంటూ వెళ్లినాసరే అశ్వమేధయాగము చేసినంత ఫలము గల్గును. ఉత్తర వాహినియైన గంగానదిలో స్నానం చేసి విశ్వేశ్వరుని దర్శించువారికి అనంతమైన శ్రేయస్సు చేకూరుతుంది. గంగను చూచుటవల్ల, దానిని తాకుటవల్ల, దానిలో స్నానము చేసి సంధ్యోపాసనాదులు చేయుటవల్ల, పంచతీర్థములను దర్శించుటవల్ల గల్గు ఫలము ఇంతఅంతా కాదు. అట్లనే విశ్వేశ్వరుని తాకుటవల్ల, పూజించుటవల్ల, ధూప దీపాది దానము చేయుటవల్ల, ప్రదక్షిణము చేయుటవల్ల, నర్తనము చేయుటవల్ల, దేవదేవా, మహాదేవా, శంభో, శివశివా, ధూర్జటీ, నీలకంఠా, ఈశా, పినాకినీ, శశిశేఖరా, త్రిశూలపాణీ విశ్వేశా, రక్షింపు ప్రభూ అని కేకలు వేయుటవల్ల, ముక్తి మండపంమీద నిమేషకాలం కూర్చుండుటవల్ల, అచ్చట ధర్మకథలను చెప్పుకొనుటవల్ల, పురాణ కథలను వినుటవల్ల, అతిథిపూజ చేయుటవల్ల, అధికాధికములైన ఫలములు అనుపాతికంగా లభిస్తాయి.

(సశేషము)




Grams : 'LODHRA' Phone : 86637

# Grihalakshmi

*Illustrated Telugu Monthly*

Published on every 15th

**Advt. Rates**

| | |
|---|---|
| Ordinary page | ... Rs. 60/- |
| 2nd Wrapper single colour | ... Rs. 80/- |
| 3rd ,, ,, | ... Rs. 80/- |
| 4th ,, ,, | ... Rs. 100/- |

*Only mounted blocks are accepted.*
*Halftones not finer than 75 screens.*

Last date for receiving advt. lay-outs and blocks—15 days in advance of the date of publication.

All communications and materials may be addressed to :

THE ADVT. MANAGER,
"Grihalakshmi"
Royapettah, Madras-14.




శ్రీమద్భాగవతం (మాహాత్మ్యము): శ్రీ పురాణపండ రామమూర్తి. ప్రకాశకులు : భాగవత ప్రచారక సంఘము, ఆలమూరు & రాజమండ్రి. వెల రు. 1.00

పద్మపురాణమును మూలంగా తీసికొని వ్రాసిన గ్రంథమిది. భాగవత మహాత్మ్యమును పఠించుటవలన పరమాత్మను మరింతగా నర్థముచేసికొనుటయేకాక పరమాత్మ సాక్షాత్కారము సయితము సులభసాధ్యము కాగలదు. ఆధ్యాత్మిక, పారమార్థిక చింతలతో అభివృద్ధి అభ్యుదయాల సాధనకు యిట్టి గ్రంథపఠనము అత్యవసరము.

◆ ◆ ◆ ◆

'మెరుపు' సచిత్ర పక్షపత్రిక మా కార్యాలయమునకు చేరినది. ఇందులో చలనచిత్ర రంగానికి సంబంధించిన వార్తలు, విశేషాలు అనేకం యున్నవి. ఇందులోని వ్యాసాలు ఉపయుక్తమైనవై ఉత్తమ స్థాయిలోనివి. ఇందలి చిత్రాలు, పత్రికా స్వరూపం సయితము చదువరులను ఆకర్షిస్తూ ఆసక్తిని కలిగించేవిగా నున్నవి. సంపాదకుడు శ్రీకృష్ణ యువకుడు కావడంవల్ల తన అనుభవ సామర్థ్యాలను వినియోగించి 'మెరుపు' పత్రికను అందచందాలతో నిర్వహిస్తున్నందుకు అభినందనీయులు. ప్రజాభిమానంతో యీ పత్రిక కలకాలం వర్థిల్లాలని మా కోర్కె. విడిప్రతి 15 నయాపైసాలు మాత్రం. కార్యస్థానం : నెం. 10, చిదంబరస్వామి 2వ వీధి, మద్రాసు-4.

ఒక ప్రఖ్యాత సినిమానటుడు చనిపోగా ఆయన స్నేహితురాలు మాధవి వెళ్దామని బయలుదేరబోతూ తన స్నేహితురాలిని కూడా రమ్మని పిలిచింది. ఆమె వస్తానని చెప్పి వెళ్లి అరగంట సేపటికి ముస్తాబై వచ్చింది.

"ఇదేమిటే! _ ఆయన చనిపోయాడని చూడబోతూ యీ మేకప్ ఎందుకూ" అన్నది విసుగుతో.

"అలాగంటావేమిట్లే? అక్కడికి వచ్చే జనం చాలమంది మనల్ని చూడటానికే కదటే వచ్చేది! అబ్బ! ఎంతమంది ఫొటోగ్రాఫర్లు ఎన్ని షాట్స్ తీస్తారు! ఎన్ని పత్రికలకు పంపుతారు! మనం వాటిల్లో అందంగా పడవద్దూ!" అన్నది రెండవ యువతి తల వెంట్రుకలకు రిబ్బన్ ముడేసికుంటూ.

వేముల కోటుంబరావు

# బి. ఏ. యస్. వారి 'రాణీరత్నప్రభ'

మే నెల 27వ తేదీన 'రాణీరత్నప్రభ' చిత్రము యావదాంధ్రదేశంలో విడుదలయింది. ఈ జానపద చిత్రానికి శ్రీ సదాశివబ్రహ్మంగారి కథ, సంభాషణలు పొందికగా నున్నవి. దర్శకత్వము శ్రీ బి. ఏ. సుబ్బారావుగారిది. ఈ చిత్రానికి మనోహరమైన శ్రీ రాజేశ్వరరావుగారి సంగీతము యింపుసొంపులను కూర్చినది.

ఇందులో రాజు (రామారావు) వేటకై వెళ్లి గొల్లపిల్ల రత్నప్రభను కలసికొని ప్రేమించి వివాహమాడుతాడు. మంత్రి (సి. యస్. ఆర్.) రాణి అయిన రత్నప్రభపై మోజుపడతాడు. రత్నప్రభ తండ్రి (గుమ్మడి) తన పెంపుడుతండ్రి మాత్రమేననియు, ఆమె రాకుమారియనియు రత్నప్రభకు తెలిపి, స్వంత తండ్రితో సమాగమం ఏర్పాటుచేస్తాడు. రాజు రాణిని పడకగదిలో కానక ఖైదికత్తె వల్ల తప్పుడువార్త విని రత్నప్రభ శీలమును శంకించి, అవమానించి శిక్షించును. రాణి నిజంగా శాశీల్యవతురాలైనచో తన్ను మూడుమారులు వివాహమాడవలసియున్నదని శాసించును. అప్పటినుండి రత్నప్రభ మూడుమారులు వచ్చి, బతికి వివిధరూపములలో రాజును వివాహమాడును. రాణీరత్నప్రభగా అంజలీదేవి కడుసమర్థంగా నటించింది. యన్. టి. రామారావు, గుమ్మడి మున్నగువారి నటన పేర్కొనతగినట్లుగా నున్నది. మంత్రిగా సి. యస్. ఆర్. నటన అంతగా రక్తికట్టలేదు.

ఈ చిత్రంలోని జిప్సీనృత్యాలు, బృందగానము మనోరంజకముగా నుండినవి. ప్రజల అభిమానపాత్రము కాగల చిత్రమిది.

—'చిట్టి'

## జగపతి పిక్చర్స్‌వారి 'అన్నపూర్ణ'

మానవసంఘంలోని వివిధ మనస్తత్వాలు, వాని పరిణామాలు 'అన్నపూర్ణ' చిత్రంలో చూపబడటానికి ప్రయత్నం జరిగింది. డబ్బుకొరకు ఆశపడి మానవుడు, న్యాయం, నీతి తప్పి ఎలా వ్యవహరించేది, పవిత్ర హృదయాల ప్రేమకు ఏర్పడే అంతరాయాలు, ధనవంతుల మనస్తత్వాలు యిందులో చక్కగా చిత్రించబడినవి. కథాగమనం మొత్తంమీద ఆసక్తి, ఉత్సాహపూరితంగానున్నా, కొన్ని సమయాలలో, సంఘటనలు దీర్ఘంగాను, [illegible], అనవసరంగా సాగదీసినట్టుగా తోచినవి. దక్షిణామూర్తిగారి సంగీతము హాయిగా నున్నది. ఎ. యస్. ఆర్., జగ్గయ్య, జమున, గుమ్మడి చక్కగా నటించారు. రేలంగి, హాస్యం కొంత పరిమితం చేసినట్లయితే, చిత్రము మరింత రక్తికట్టేది.

ఉత్తమాదర్శాలను పూరిస్తూ, నైతికస్థాయిని పెంపుచేయుటకు తోడ్పడగల యీ చిత్రంలో వినోదం, విజ్ఞానము యిమిడియున్నవి. ఈ చిత్రనిర్మాతలు, దర్శకులు శ్రీ వి. మధుసూదనరావు 'అన్నపూర్ణ' చిత్రనిర్మాణంలో చూపిన శ్రద్ధాసక్తులు అభినందించతగినవి. ప్రజలను యీ చిత్రం అన్నివిధాల ఆకర్షించ గలదు.

## మాడరన్ థియేటర్స్‌వారి 'అన్నాచెల్లెలు'

శ్రీ విఠలాచార్య దర్శకత్వాన నిర్మించబడిన 'అన్నాచెల్లెలు' చిత్రం విడుదలయింది. కాని అనుకున్నంత స్థాయిలో యీ చిత్రము లేదు.

ఇందులో రాజనాల, దేవిక, మీనాకుమారి, రమణమూర్తి, మిక్కిలినేని మున్నగువారు నటించారు.

ఉత్తమ ఇల్లాలిని, ఆమె సేవాత్యాగాలను చిత్రించడానికి ప్రయత్నం జరిగింది. దుర్మార్గానికి, దురాశకు ప్రతిఫలం వెన్నంటేయుంటుందనేది కూడా యీ కథా అంశాలలో నొకటి.

ఇందులో రాజనాల విలన్‌గా ప్రజ్ఞావంతంగా నటించారు. దేవిక సహజంగాను, మిగిలినవారు సామాన్యంగా నటించారు.

ఇందులోని కొన్ని సందర్భాలు, సన్నివేశాలు పేలవంగా కనుపించినవి. సంగీతము సాధారణముగా నున్నది.

—పున్నయ్య

---

ఇద్దరు మిత్రులు చాలాసేపు తర్కించుకుంటూ మాట్లాడిన తరువాత "కాఫీ తెప్పించమంటారా?" అడిగాడు ఒకడు.

"నీకు పుణ్యముంటుంది — కాఫీతోబాటు ఒక అనాసిన్ టాబ్లెట్ కూడా తెప్పిస్తే" అన్నాడు రెండవవాడు ఎదటివాని వితండవాదంవల్ల తలనొప్పితో బాధపడుతూ.

సేముల కుటుంబరావు

# సంపాదకీయములు

## బాలల ఆరోగ్యం

ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య హైదరాబాద్‌లో శిశువైద్యకేంద్రానికి ప్రారంభోత్సవము చేస్తూ బాలల ఆరోగ్యమే దేశసౌభాగ్య చిహ్నమన్నారు. కాని బాలల ఆరోగ్యము వైద్యసదుపాయాలు విస్తృతమగుటవలన మాత్రము మెరుగగునది కాదు. దానితోబాటు ఆ బాలలకు మంచి ఆహారము, శుచి, శుభ్రమైన వాతావరణము అవసరము. ఇంకా బాలల ఆరోగ్యము తల్లిదండ్రుల ఆరోగ్యము, ఆర్థికస్థితిగతులమీద నాధారపడియుంటుంది. అంటే మొత్తంమీద ఆరోగ్య, వైద్యసదుపాయాలు విస్తృతమై, ప్రధానావసరాలైన ఆహారపానీయాలలో యీనాడు అధికంగానున్న లోపాలు, లోటుపాటులు సమసిపోయిననే బాలల ఆరోగ్యంగాని, తదనుగుణంగా దేశసౌభాగ్యంగాని పెంపుకావు,

## ప్రపంచంలో భారతస్త్రీల ఆధిక్యత

చిత్తరంజన్‌లో జరిగిన బహిరంగ సమావేశంలో ఉపన్యసించుచూ మన ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణగారు భారతదేశంలో తప్ప మరే దేశంలోను పదునైదుమంది సభ్యురాండ్రుగల ప్రజాప్రతినిధుల సభ (పార్లమెంటు) లేదనియు, భారతస్త్రీలవలె గవర్నర్లు, రాయబారులు మొదలైన ఉన్నత పదవులను ఏ యితర దేశస్త్రీలు నిర్వహించడం లేదనియు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఇది నిజంగా గర్వకారణమే. కాని స్త్రీలలో యింకా విద్యావిజ్ఞానములు పెంపుకావలసియున్నవి. వాస్తవికతకనుగుణ్యంగా బరువు భారాలను, బాధ్యతలను వహించడానికి మహిళలు ఉద్యుక్తులు కావలసియున్నది. సమానావకాశములు, హక్కులకు ప్రాకులాడుట సయితం జాతీయ విశిష్టతకనుగుణంగా కుటుంబ సౌభాగ్యము కుంటుపడకుండాయుండే రీతిగా నుండాలి. జాతీయావసరాలను గుర్తించి సహజసిద్ధమైన శక్తిసామర్థ్యాలననుసరించి బాధ్యతలను పంచుకొని జాతీయ పురోభివృద్ధిని రూపొందించడంలో స్త్రీ, పురుషులు సమాన భాగస్వాములన్న విషయం మరువకూడదు. దీనివల్ల మన జాతీయతకు, నారీలోకానికి కీర్తి ప్రతిష్ఠలు దాని విశిష్టత చిరస్థాయి కాగలవు.

## పరిపాలనా సంస్కరణలు

పరిపాలనా విధానాన్ని సంస్కరించే మార్గము నుద్దేశించి ప్రజల సూచనలకోసరం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పరిపాలనా సంస్కరణల సంఘము నొకదానిని ఏర్పరచి దానికి సూచనలను యీ నెలాఖరు లోపల పంపవలసినదిగా కోరింది. ఈ విజ్ఞప్తిని పురస్కరించుకొని ప్రజలు విశేషముగా సూచనలు పంపవచ్చును. అందులో కొన్ని అమూల్యమైనవై ప్రస్తుతపు లోటుపాట్లను సరిదిద్దగలవి యుండవచ్చును. వానిని పరిపాలకులు చిత్తశుద్ధితో పరిశీలించి తమ అనుభవ కృషులను పరిపాలనా విధానసంస్కరణకు వినియోగించినచో సత్ఫలితాలు అనేకముండగలవు. ఈ సందర్భమున ప్రజల సహకారసహాయములు ప్రభుత్వమునకు లభించగలవని ఆశిస్తున్నాము.

## శ్రీమతి రాధాబాయ్ సుబ్బరాయన్ గారి మృతి

ప్రముఖ సంఘసేవకురాలు, దేశభక్తురాలు, జాతీయ సమరంలో వీరోచితంగా పోరాడిన వనిత, శ్రీ రాధాబాయ్ సుబ్బరాయన్ మృతి చాల విచారకరమయినది.

ఆమె విద్యాధికురాలుగా, సంస్కరణలపట్ల అభిలాషిగా, జాతీయసేవికగా ఆదర్శనీయ గాంధిజీ నిర్మాణకార్యక్రమంపట్ల ఆమె ఆసక్తి అత్యధికము. జాతీయసమరంలో నేమి, నిర్మాణకార్యకలాపాలలో నేమి ఆమె నిర్వహించినపాత్ర అనేకమంది మహిళలను ఉత్తేజపరచి జాతీయ పురోభివృద్ధిని రూపొందించుటకు తోడ్పడినది. ఆమె చిత్తశుద్ధి, నిష్కళంకమైన దేశభక్తి, సేవాసక్తి ప్రశంసనీయమే కాక అనుసరణీయములు కూడాను.

ఆమె కృషి, నాయకత్వము మహిళాభ్యుదయాన్ని ప్రోత్సహించినవి. మహిళా ఉద్యమమునకు ఆమె నాయకత్వము అమూల్యమైనదిగా నొప్పినది. అంతర్జాతీయ రంగంలో సయితం ఆమె నిర్వహించినపాత్ర పేర్కొనతగినది.

మనదేశంలో స్త్రీలకు ఓటింగ్ హక్కు కొరకై ఉద్యమాన్ని ప్రారంభించినవారిలో శ్రీమతి రాధాబాయ్ సుబ్బరాయన్ ఒకరు. కేంద్ర శాసనసభలో బహుభార్యాత్వ నిషేధం బిల్లును ప్రవేశపెట్టారు. గనులలో స్త్రీలు పనిచేయరాదన్న అంతర్జాతీయ కార్మిక మహాసభ కట్టుబాటును భారతదేశముకూడా అంగీకరించాలని ఒత్తిడి చేశారు. అఖిలభారత మహిళామండలి సంస్థాపకులలో ఆమె ముఖ్యురాలు. రెడ్ క్రాస్, శిశుసంక్షేమోద్యమాల విస్తరణకు సయితము విశేషంగా కృషిచేశారు.

ఈమె కేంద్ర రవాణామంత్రి డా॥ పి. సుబ్బరాయన్ భార్య. ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె కలరు. వారికి మా సానుభూతి సంతాపములను తెలుపుచున్నాము.

— (o) —

(248 వ-పేజీ తరువాయి)

తన పనిపాటలు ముగించుకొని ఆమెయొద్దకు పరుగెత్తాడు. ఆమె గుమ్మంలో కూర్చొని పట్టుదారాలు చుడుతున్నది.

"ప్రేయసీ! తెచ్చాను - ఎర్రగులాబీపూవును. నీవానాడు ఎర్ర గులాబీపువ్వు తెచ్చియిస్తే నాతో నాట్యం చేస్తానన్నావు. ఇదిగో - ఎంత అందంగా ఉన్నదో చూడు! మనమిద్దరం నాట్యం చేసేటప్పుడు దీన్ని నీ హృదయానికి సమీపాన అలంకరించుకో! అది నాకు నీమీదగల అవ్యాజమైన ప్రేమకు చిహ్నం" అన్నాడు పుష్పాన్ని అందిస్తూ.

ఆమె ముఖం వికసించలేదు. కడకు చిరునవ్వైనా తొణికిసలాడలేదు. పైగా "నీవు నా దుస్తులు చూచైనా గ్రహించలేకున్నావా! రాజకుమారుడు నాకీ దుస్తులను పంపాడు. పిచ్చివాడా! నేను ధరించిన దుస్తులు, నగలు నీ పువ్వుకంటె ఎన్నో వేల రెట్లు విలువగలవని ఎవరికి తెలియదు!" అన్నది నిర్దాక్షిణ్యంగా.

"విశ్వాసఘాతకురాలు!" అంటూ పట్టరాని కోపంతో ఆ పువ్వును విసరి నేలకేసి కొట్టాడు. అది తూలివెళ్లి రోడ్డుమీద పడింది. దారినపోయే బండి చక్రం దానిమీదుగాపోయి నామరూపాలు లేకుండా నలిగిపోయింది.

"నేనా విశ్వాసఘాతకురాలిని? జేబులో పయాపైసా లేదు కాని తీయనికలలు మాత్రం కంటున్నావే!" యంటూ యింట్లోకి వెళ్లి గట్టిగా తలుపేసుకుంది.

విద్యార్థి తనగదికి తిరిగివెళ్లి దుమ్ము, ధూళి ఆవరించిన పుస్తకాలను దులిపి చదువుకో నుపక్రమించాడు.





Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor: C. C. Punniah. Proprietors Kesari Kuteeram (Private) Ltd.